

ఫిబ్రవరి **1979** సంచికలో

అందించబడిన

పూర్తి నవల



# నెవర్ లీవ్ మీ

రచన:

'దుర్గ'

అది న్యూయార్కు నగరం. అందంగా వెలిగిపోతోంది.

రీత్యా, పైచదువులరీత్యా విదేశం వెళ్ళిన భారతీయులంత సంఘంగా ఏర్పడి, సభలు, సమావేశాలు, వినోదకార్యక్ర జరుపుకొనే భవనం అది. తరచూ 'గెట్ టుగెదర్' పార్టీల వివిధ భాషలకు, రాష్ట్రాలకు, జాతులకు చెందిన భారతీయుల సహృద్భావం, సహృదయత, స్నేహశీలత పెంపొందింప జే అవకాశం కల్పిస్తారు.

అలా కలిసి ఫంక్షన్స్ జరుపుకుంటున్నప్పుడు తాత్కాలి నైనా కృత్రిమంగా, మరీ ఫార్మల్‌గా, విలాసంగా, నిర్లక్ష ప్రవర్తించే అమెరికన్లను మరచిపోయి తమ దేశంలో ఉ భావించి సంతోషంగా గడుపుతారు. కాని అమెరికా అలవా పద్ధతులకు అన్నివిధాలా అలవాటుపడిపోయి, తమదికాని అల స్వంతం చేసుకుని తాము భారతీయులమనే తలంపే రానీయక, మంగా విలాసంగా కాలం గడిపేవారు కూడా లేకపోలేదు.

ఏది ఏమైనా ఒక దేశానికి చెందిన వారంతా పరాయిదే కలిసికొన్నపుడు మనసులో పరవళ్ళుత్రొక్కే ఆనందం దాచ లన్నా దాగదుకాబోలు. ఎవరన్నా క్రొత్త భారతీయుడు వ డంటే ఆ రోజు మరింత సంబరంగా జరుపుకొంటారు. అ అతని భార్యను ఆహ్వానించడానికి సన్నాహాలు అట్టహాసంగా చే

వారిలోని బెదురు, బెరుకు పోగొట్టడానికి ప్రయత్ని 'టీమ్ స్పిరిట్' అనేది యిక్కడ కన్పిస్తుందనిపిస్తుంది.

ఆరోజు ఇంజనీరు నరేంద్ర తన భార్య డాక్టర్ వ క్రొత్తగా రావడంతో ఆ దంపతులను 'వెల్‌కమ్' చేసి తదిత తీయులకు పరిచయం చేసే రోజు. ఆ ధంపతులు వార క్రితమే ఇండియా నుంచి వచ్చారు.

నరేంద్ర, వందనలు ముందుగా వచ్చి సంఘం ( డాక్టర్ పాయ్‌తో మాట్లాడుతున్నారు. భారతీయసభ్యులు ఒ రాసాగారు.

సంఘం సెక్రటరీ మిసెస్ నందా హడావిడిగా వ

"సారీ మిస్టర్ పాయ్! కాస్త ఆలస్యం అయింది" అంటూ కుర్చీలో నరేంద్ర ప్రక్కన కూర్చుంది.

పాయ్ వాళ్ళిద్దరిని మిసెస్ నందాకు పరిచయం చేశాడు.

"వెల్‌కమ్ మిస్టర్ అండ్ మిసెస్ నరేంద్ర" షేక్ హాండ్‌కు చేయి చాస్తూ అంది.

నరేంద్ర ఆ చేయి అందుకుని షేక్‌చేసి వదిలాడు. చేతినందు కోక చేతులు జోడించి 'నమస్తే' చెబుతున్న వందన వంక ఓ క్షణం చూచి నవ్వేస్తూ

"ఓ! నమస్తే"అంది తనూ చేతులు జోడించి మిసెస్ నందా.

మిసెస్ నందాకు నలభై ఏళ్ళుండవచ్చు. పచ్చని ఛాయతో పొడుగ్గా, పొడవుకు తగ్గ లావుతో అందంగా హుందాగా కన్పించింది వందనకు.

కొంచెంసేపటికి హాలంతా దాదాపు నిండిపోయింది.

ఓ క్షణం హాలంతా పరికించి చూసి అన్నాడు పాయ్.

"మిసెస్ నందా! ఆల్‌మోస్ట్ అందరూ వచ్చినట్లే. ఇక పరిచయాలు కానిద్దామా?"

పాయ్ వెనకాలే డయాస్ మీదికి వెళ్ళారు నరేంద్ర దంపతులు. ఎంత చదువుకున్నదయినా వందనకి కాస్త బెరుగ్గా ఇబ్బందిగా వుంది యీ వాతావరణం.

పాయ్ మైకులో "సైలెన్సు ప్లీజ్!" అనగానే చెల్లాచెదురుగా ...ంపులుగా మాట్లాడుకుంటున్న వారంతా సీట్లలో కూర్చున్నారు ...నంగా.

"ఈ రోజు మనమధ్య ఓ కొత్తదంపతులు రావడం మనకి ... సంతోషకరమైన విషయం. ఈ క్రొత్త ప్రదేశంలో పరాయి ...లో వారు ఎలాంటి యిబ్బంది పడకుండా చూసే బాధ్యత మన ... మిస్టర్ నరేంద్ర ఇంజినీరుగా పనిచేయడానికి వచ్చారు. ... నరేంద్ర డాక్టర్ వందన ఎం.డి.," అంటూ కూర్చున్నాడు.

... వెంటనే అందరూ "వెల్‌కమ్ మిసెస్ అండ్ మిస్టర్ నరేంద్ర! ...)" అంటూ కోరస్‌గా పలికారు.

నరేంద్ర నవ్వుతూ 'బో' చేసాడు అందరికి. వందన కొద్దిగా తలవంచి చేతులు జోడించింది చిన్నగా నవ్వుతూ.

'ఓహ్! ఈ అమ్మాయి ప్రతి కదలికలో ఏదో అందం ఆకర్షణ ఉంది' అనుకుంది మిసెస్ నందా.

తర్వాత మిసెస్ నందా వారిద్దరిని ఒక్కొక్కరి వద్దకు తీసి కెళ్ళి పరిచయం చేయడం ప్రారంభించింది.

'మిస్టర్ అండ్ మిసెస్ గుప్తా....'

'మిస్టర్ అండ్ మిసెస్ వర్మ....'

'మిస్టర్ రాయ్....అరె మీ భార్య ఏదీ?''

మిసెస్ నందా ప్రశ్నకు 'జ్వరంగా వుంది రాలేకపోయిందని' చెప్పాడు. పరిచయాలు పలకరింపులు అవుతున్నాయి.

"మిస్టర్ అండ్ మిసెస్ రెడ్డి. మీ ఆంధ్రా అనుకుంటాను."

మిసెస్ జయశ్రీరెడ్డి పలకరించింది వందనను.

"మీరు ఆంధ్రాలో ఎక్కడ వుండేది? అయిమీన్ సొంత ఊరు ఏది?"

"వైజాగ్"

"మీకు సునందా తెలుసా? వైజాగ్‌లోనే మెడిసిన్ చదివింది."

"యు మీన్ పి. సునందా. తెలీకేం? నా క్లాస్‌మేట్ తను. మీకు బంధువా?"

"యా! తను మా అక్కయ్య" జయశ్రీ సునందను గురిం చెబుతూంటే వింటూంది.

"హల్లో మిసెస్ నందా! సో సారీ ఫర్ ది డిలే."

"హల్లో మిసెస్ శేఖర్! ఆలస్యానికి కారణమేమిటి? ఇఫ మిమ్మల్ని తలచుకొంటున్నాను. ఏపార్టీకైనా ముందు మీరుండాలి కదా! మీరులేకుండా ఏమిటో సందడే లేనట్లుంది. బైదిబై మీవా మిసెస్ నందా గొంతులో కాస్త వ్యంగ్యం ఉందనిపించింది వ

"నేను పార్టీ మిస్ అవుతానా? పార్టీకనే బయలుదేరా శేఖర్. మధ్యలో ఏదో అడ్డురావడంతో సడెన్‌బ్రేక్ వేశాడు. వేయడంలో ముందున్న గ్లాస్ తలకి తగిలి కాస్త గాయమ

అతన్ని డాక్టర్ దగ్గరకు తీసికెళ్ళి కట్టు కట్టించి, ఇంటిదగ్గర డ్రాప్ చేసి వేరే కారు తీసుకొని వచ్చేసరికి యింతాలస్యం అయింది. సారీ" ఇంకోసారి క్షమార్పణ చెప్పింది.

"ఏమిటీ! తలకు గాయమయిందా" ఆదుర్దాగా పలికింది మిసెస్ నందా గొంతు.

"ఓ! నథింగ్. ఏదో మైనర్...." నిర్లక్ష్యంగా అంటున్న ఆమె వైపు చూడకుండా వుండలేకపోయింది వందన.

సన్నగా, తెల్లగా పొడుగ్గా వుంది. అందంవున్నా అలంకరణ మరింతగా వుంది. లోనెక్ వున్న మాక్సీ వేసుకొంది. బాబ్డుహెయిర్. ఆ అమ్మాయిలో సెక్స్ అప్పీల్ వుందనిపిస్తుంది. శంఖంలా వున్న మెడలో డైమెండ్ నెక్లెస్ కాబోలు ధగధగ మెరిసిపోతూంది. లైట్ వెలుతురులో చేతివేలికి, చెవుల్లో వ్రేలాడుతున్న రింగుల్లో డైమెండ్ మెరుస్తూంది.

"కానీ సుషమా. నువ్వు దగ్గరవుండాల్సింది. పాపం అతనికేం తోస్తుంది" సానుభూతిగా అంది మిసెస్ నందా.

"ఓ.... హెల్! బోర్. ఇటువంటి అందమైన సాయంకాలం వృధాగా యింటిదగ్గర యెవడు గడుపుతాడు? అయినా హి నెవర్ మైండ్స్."

చిన్నగా బాధగా నిట్టూర్చించింది మిసెస్ నందా.

ఏంచేస్తాడు పాపం! భార్యను మందలించబోతే అతనిది సంకు త మనస్తత్వం అంటుంది. ఆర్తడాక్స్ అంటుంది. సంఘంలో న భర్తను తానే చులకన చేసుకుంటుంది.

ఏదైనా మోతాదుకు మించితే వెగటు అని, విపరీత పరిణామా దారితీస్తుందని ఎప్పుడు తెలుస్తుంది?

అందరితో మరీ విచ్చలవిడిగా ప్రవర్తిస్తే, ఆమె ముందు రిల్లి, ప్రశంసిస్తున్నవారే వెనకాల ఎలాంటి కారుకూతలు రో తెలిస్తే ఏమంటుందో. ఆమె కలివిడి తనాన్ని, చనువుని ఫంది ఎన్ని రకాలుగా వాడుకుంటున్నారో.

వేంద్ర దంపతులకు మిసెస్‌నందా సుష్మాను పరిచయం చేయ

బోతుండగా మగవారంతా సుష్మా చుట్టూ చేరి మాట్లాడించడం ప్రారంభించారు. అందరితో నవ్వుతూ, కలివిడిగా చనువుగా మాట్లాడుతూ వాళ్ళందిస్తున్న డ్రింక్స్, కేక్స్ తింటూన్న సుష్మా హఠాత్తుగా అంది.

"ఓ! మై గుడ్‌నెస్! మరిచేపోయాను. అన్నట్టు ఈ రోజు కొత్త మెంబర్స్ ఎవరో వచ్చారు కదూ! ఏరీ వాళ్లు?" అందంగా కళ్ళు తిప్పుతూ పరికించి చూచిన సుష్మా దృష్టి కంచిపట్టు చీర కట్టుకుని నిండుగా అందంగా వున్న వందనమీద పడింది. వందన అలంకరణ చూచిన సుష్మా కళ్ళు చికిలించింది ఓ క్షణం.

"పార్డన్‌మి" అంటూ తనను చుట్టిన వాళ్ళను తప్పించుకొని చేతిలోవున్న గ్లాస్‌లోని డ్రింక్ త్రాగుతూ వాళ్ళ దగ్గరకు వయ్యారంగా నడచి వచ్చింది.

మిసెస్ నందా పరిచయం చేసింది.

"హల్లో! గ్లాడ్ టు మీట్ యూ" వయ్యారంగా చేయి ముందుకు చాచింది.

"నమస్తే."

వందన చేతులు జోడించడం చూచి పగలబడి నవ్వింది సుష్మా. ఎందుకంతగా నవ్వుతూందో అర్థంకాలేదు వందనకు. మిసెస్ నందా మొహంలో చిరాకు తొంగిచూస్తూంది సుష్మా ప్రవర్తనకు. వూగుతూ నవ్వడంలో సుష్మా చేతిలోని బీరు వందన చీరమీద కాస్త ఒలికింది.

"ఓ....స్టాప్ లాఫింగ్" మిసెస్ నందా గొంతు విని నవ్వు ఆపింది సుష్మా.

"సీ వాట్ యూ హేవ్ డన్" చీరవైపు చూపుతూ అ మిసెస్ నందా.

"ఓ అదా మీ కోపం. సారీ మిసెస్...."

ఆ చెప్పడంలో నొచ్చుకున్న ఛాయలు ఎక్కడా లేవు. ఏ నిర్లక్ష్యంగా అంది.

"ఓ అయ్ కాంట్ స్టాండ్ దిస్ కన్‌సీటెడ్ వుమన్"

కుంటూ కూర్చుంది వందన.

"మీరు రాజపాళెం జమిందారు కూతురు కదూ?" నరేంద్ర ప్రశ్నకు అతనివైపు తిరిగింది సుష్మా.

"దట్స్ రైట్. మిమ్మల్ని ఎక్కడో చూశాను...." గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ అంది.

"మీ వూరి కరణంగారి అమ్మాయి పెళ్ళిలో చూశారు. ఆ అమ్మాయి భర్త మా కజిన్."

"ఓ! యస్ యస్. నౌ అయ్ రిమెంబర్...."

"రండి అలా వెళ్దాం. ఇంకో డ్రింక్ తెచ్చుకుంటాను. ఆ అమ్మాయి నా ఫ్రెండ్. పెళ్ళయిం తర్వాత ఆ అమ్మాయి విషయాలు తెలియలేదు. కొంతమంది పెళ్ళయిపోతే బాహ్య ప్రపంచాన్ని పూర్తిగా మరచిపోయి తమ చుట్టూ గిరి గీసుకుంటా రెందుకో. అయ్ జస్ట్ కాన్ట్ అండర్‌స్టాండ్ అండ్ టాలరేట్" నరేంద్ర చేయి పట్టుకుంటూ అంది సుష్మా.

నరేంద్ర వందన యిద్దరూ ఆశ్చర్యపోయారు ఆమె చనువుకు.

"వందనా! నీకేమైనా డ్రింక్ తీసుకురానా?" భార్యను అడిగాడు నరేంద్ర సుష్మాతో వెళ్తూ.

"యస్ ప్లీజ్! కోకోకోలా."

"మీ ఆవిడ పేరు వందనా? ఆ విషయం ఆవిడ వందనాలు అనే చెప్తున్నాయి." సుష్మా మాటల్లో వ్యంగ్యం తొంగి చూసింది.

వందన మనస్సు చివుక్కుమంది.

తార్వాత వీరి 'వెల్‌కమ్ పార్టీ' సందర్భంగా ప్రదర్శింపబడిన ...తా' డాన్స్ చూడటంతో చాలా ఆలస్యం అయింది. సుష్మా పెట్రోలు అయిపోవడంతో నరేంద్రను డ్రాప్ చేయమని

* * *

...క్కరిది ఒక్కో ప్రవృత్తి. ఎవరిది వారికి బాగున్నా ...వింతగానే వుంటుంది. ఎదుటివారు ఎందుకలా ప్రవర్తి...

...థం

స్తారో అని ఎవరికివారు అనుకుంటూ ఆశ్చర్యపోతారు. నిజానికి అందరూ ఒకలా వుంటే, ఒకలా ప్రవర్తిస్తే సృష్టిలో వింతేముంది? సృష్టిలో వైవిధ్యానికి తావేది? ఆ వివిధచిత్త ప్రవృత్తి సృష్టికి అందం విధాతకు ఆనందం కాబోలు.

ఇదే ఇంకో రకంగా చెప్పాలంటే ఒక్కొరికి ఒక్కొక్క రకం పిచ్చి. ఎవరి పిచ్చి వారి కానందం అంటారు.

సౌందర్యం చాలా మందిలో వుంటుంది. అది భౌతికం కావచ్చు. మానసికం కావచ్చు. ఈ రెండో రకం చాలా మందిలో లోపిస్తుంది. భౌతిక సౌందర్యానికి హృదయ సౌందర్యం తోడైతే సువర్ణానికి సువాసన అబ్బినట్లే. కాని ఎంతమందిలో వుంటుంది?

అసలు సౌందర్యం అనేది మానసికానుభూతి కాబోలు. అందు కనే భావకులు, కవులు గడ్డిపోచలో సైతం సౌందర్యం చూడగలుగు తారు.

ఆడదానికి సౌందర్యం వరం లాంటిది. కొంతమంది పాలిట అది శాపం కావచ్చుకూడా. సౌందర్యాన్ని ఎరగా చూపి తమ పనులు సాధించుకొనే వారు కొందరు. సౌందర్యాన్ని ఎరగా చూపి మగవారిని తమ చుట్టూ తిప్పుకొంటూ, వారిని ఆకర్షింప చేసుకుంటూ, త అతిశయాన్ని, అభిజాత్యాన్ని సంతృప్తిపరుస్తూ వినోదిస్తూం కొందరు. ఆ కోవకు చెందిన మనిషే సుష్మా.

స్వతహాగా అందమైనది. అలంకరణ తోడు దానికి. దారు వంశంలో పుట్టిన దవడంతో అభిజాత్యం, అతిశయం ఎకు కోటీశ్వరుడైన జమిందారుకు ఏకైక పుత్రికగా, గారాల పట్టిగా డంతో జీవితమంతా వడ్డించిన విస్తరిలా, పూలపాన్పులా తోంది. తను మనసుపడింది సాధించే పట్టుదల, ఆవకాశ వనిత.

ఎంత నిర్లక్ష్యంగా వెళ్ళిపోయింది పార్టీకి సుష్మా! అతి అపురూపమైన, ముఖ్యమైన వివాహ విషయంలో టడుగు వేయలేదు కదా!

ఒకదానికొకటి సంబంధం లేకుండా యిష్టానుసా

పోతున్న శేఖర్ ఆలోచనా ప్రవంతికి అడ్డుపడ్డట్టయింది కారు డోర్ వేసిన చప్పుడు.

"కమిన్ ప్లీజ్" ఎవరితోనో అంటోంది సుష్మా.

"ఓ! నో ప్లీజ్. ఇంకోసారెప్పుడైన...." ఎవరిదో యువతి కోకిల కంఠం.

"నథింగ్ డూయింగ్. ఈ టైంలో 'టీ' చేసుకు త్రాగితే ఎంత మజాగా వుంటుందో మీకు తెలీదు. రావాలి మరి."

"ఓకే...." ఎవరిదో మగ గొంతు.

గబుక్కునలేచి డ్రెస్ చేసుకోబోయాడు. ఇంతలో "శేఖర్... శేఖర్...." అబ్బా ఎన్నిసార్లు చెప్పినా ఎందుకంత గట్టిగా పిలుస్తుందో.

తప్పనిసరిగా నైట్ డ్రెస్‌తోనే 'లివింగ్‌రూం' లోకి వచ్చాడు.

"హాయ్ డార్లింగ్! ఫీలింగ్ బెటర్?" అతని బుగ్గను ముద్దిడితూ అడిగింది.

పరస్పరం పరిచయం చేసింది.

'నమస్తే' చెబుతున్న వందనను చూసి ఓ క్షణం నిరుత్తరుడయాడు. ఈ గొంతు, ఈ రూపం....వందన కూడా ఓ క్షణం ఆశ్చర్యపోయింది. అన్నట్టు ఇతను ఇక్కడే కదూ వుండేది!

కలల్లో, ఆలోచనల్లో మిగిలిపోయిందనుకున్న రాణి సజీవంగా ఎదుట నిలిచింది.

వందనే ముందు తేరుకుంది.

"బాగున్నారా" చిరుగా నవ్వుతూ అడిగింది.

ఎంత స్నేహశీలత! ఏమాత్రం లోపం లేకుండా పల్కింది. అదే ఇంకొకరైతే మొహంమీదే అడిగేసి వుందురు.

"ఊం! మీరెలా వున్నారు?" బదులుగా నవ్వుతూ అడిగాడు.

"అరె మీరు పరిచయస్తులేనా? అయితే మాట్లాడుతూండి. నేను టీ తెస్తాను" లోపలికి వెళ్ళింది సుష్మా.

"ఎలా పరిచయం మీకు?" నరేంద్ర కంఠంలో ఉత్కంఠ.

చెప్పేంతలో వందన అంది. "జీవితం అనే ప్రయాణంలో

ఎన్నో మజిలీలు. ఆ మజిలీలలో ఎన్నో పరిచయాలు. కొన్ని పరిచయాలు జ్ఞాపకాలుగా మిగిలిపోతాయి. మరికొన్ని ముందుకు సాగుతాయి. కొన్ని యిటుకాక అటుకాక గతంలో కరిగిపోతాయి."

'ఎంతటి సమయస్ఫూర్తి.' మనసులోనే మెచ్చుకున్నాడు శేఖర్.

ఇంతకీ వీళ్ళ పరిచయం ఏ కోవకు చెందుతుందో అర్థం కాలేదు నరేంద్రకు. నొక్కి అడగడానికి సంస్కారం అడ్డువస్తోంది.

"మా ప్రొఫెసర్ అంటూండేవారు "దిస్ వరల్డ్ యీజ్ టూ స్మాల్ టు రన్ విత్ వన్ ఎ నదర్. మనం యిక జీవితంలో కలవమేమో అనుకున్న వ్యక్తుల్ని మళ్ళీ మళ్ళీ కలుస్తూంటాము. చాలామంది ఈ ప్రపంచం సువిశాలమైంది అనుకుంటారు. కాని విడిపోయిన స్నేహితులు, బంధువులు ఎప్పుడో ఒకప్పుడు ఎక్కడో ఓచోట కలుసుకునే అవకాశం వుంది" మా ఫేర్‌వెల్ పార్టీ రోజు ఆయన మాట్లాడిన మాటలివి."

క్రొత్తవారితో వందన యింతగా మాట్లాడటం చూడని నరేంద్రకు ఆశ్చర్యంగా వుంది.

అప్పుడే టీ ట్రేతో హాలులోకి వచ్చిన సుష్మ అడిగింది.

"ఇంతకీ ఎక్కడ కలిసారు మీరు?"

భర్త చూపులుకూడా తనమీద నిలవడంతో వందన నవ్వేస్తూ అంది. "ఓ మీ అనుమానం యింకా తీరలేదా? డాక్టర్స్ కాన్ఫరెన్సుకు ఫార్మకాలజీలో డాక్టరేట్ చేసి ఇండియాకు లీవ్‌మీదవచ్చిన యీయన్ను మా కాలేజీ వాళ్ళు పిలిపించి స్పీచ్ యిప్పించారు. అక్కడకలిసాను. చక్కని వ్యక్తి ఈయన...."

సగం నిజం సగం అబద్ధం అనుకున్నాడు శేఖర్.

జీవితంలో మొట్టమొదటిసారిగా అబద్ధం ఆడవలసి వ నందుకు బాధగానే వుంది వందనకు.

* * *

మనసు గంభీరమైన కడలిలాంటిది. కడలిలోని అల మనసులోని ఆలోచనలు అనంతం. సముద్రంలో కొన్ని ఉప్పొంగుతుంటాయి. అలాగే మన మనసుకునచ్చిన ఆలోచన

భావాలు సంతోషాతిశయంతో ఉప్పొంగుతాయి. కొన్ని అలలు కడలిని దాటి తీరాన్ని చేరాలని తాపత్రయపడతాయి. కాని అవి తిరిగి అనంత జలరాశిలో లాక్కోబడతాయి. అలలు ఎంత ప్రయత్నించినా అవి జలధిలోనే ఉండిపోతాయి. ఆలాగే కొన్ని భావాలు మనసులోంచి బయటకు నెట్టివేయాలని ప్రయత్నిస్తాం. కాని తీరాన్ని దాటలేని అలలు లాగానే మనసులోనే యిమిడిపోతాయి.

సముద్రపు లోతు చెప్పజాలనిది. అలాగే మనసులోతూ కొలవజాలనిది. మనసుదాటి బయటకు రాలేని ఆలోచనలు, భావాలు హృదయపు అట్టడుగు పొరలలో దాక్కుంటాయి. తిరిగి ఆ ఆలోచనలకు, భావాలకు మూలకారణమైన వస్తువుకాని, వ్యక్తిగాని ఎదురైనపుడు చంద్రుని చూసి పైకెగిరి అందుకోవాలనే అలలులాగా మనసులో వారి తాలూకు భావాలు ఉప్పొంగుతాయి.

* * *

రాజశేఖర్ ఫార్మకాలేజీలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పని చేస్తున్నాడు. అదే మెడికల్ కాలేజీలో గైనకాలేజీలో లెక్చరర్‌గా చేరింది వందన.

కాలేజీ ఆవరణలో కలసిన వందనను చూసి విష్ చేశాడు ...ర్.

"ఎలావుంది కాలేజీ వాతావరణం యిక్కడ?" ఆమెప్రక్కగా ...స్తూ అడిగాడు రాజశేఖర్.

"విజ్ఞాన రంగంలో వీళ్ళనుంచి మనం నేర్చుకోవలసింది ...వుందనిపిస్తుంది. ముఖ్యంగా వాళ్ళ కార్యదీక్ష, సిన్సియారిటి ...తో తగ్గది. ప్రతివిషయమూ ఎంతో శ్రద్ధగా, నిజాయితీగా ...పరిశీలించడం వల్లనే కాబోలు మనకంటే వైజ్ఞానికంగా ...రనిపిస్తుంది. ఇవి మన ఇండియన్ స్టూడెంట్సులో ఎక్క... ...నవంతులు డబ్బుతో సీట్లను కొని, కాలేజీలో చేరి, ...ు కాకాపట్టి, లంచం యిచ్చి మార్కులుకూడా కొని ...ుకుంటారు. నిజాయితీ గల విద్యార్థులు ఏ కొద్దిమందో ...అవకాశవాదులైన ధనవంతులైన విద్యార్థులు అవరోధాలు

...థం

కల్పించి, వారిని పైకి రానివ్వకుండా చేస్తారు. ఇలాంటివారు విదే-శాలకు వచ్చి వీరి కార్యదీక్షను చూసైనా నేర్చుకుంటారా అంటే అదీ లేదు. ఎంతసేపూ యిక్కడి నాగరికతను అలవాట్లను అల వరచుకొని అనుకరిస్తూంటారు. అందరూ అలాంటివారని కాదుగాని, మెజారిటీ యిలాంటివారే." ఆవేశంగా చెప్పుకుపోతున్న వందనను ఆశ్చర్యంగా చూశాడు శేఖర్.

"ఇక్కడ కూర్చుందామా?" అంటూ చెట్టుక్రింద కూర్చున్నాడు.

అతనికెదురుగా కూర్చుంది వందన।

"ఆరోజు రాత్రి ఎందుకలా చెప్పారు మన పరిచయం గురించి?" హఠాత్తుగా అడిగాడు.

అందంగా నవ్వింది వందన.

"ఏం చెప్పమంటారు? అసలు విషయం చెబితే ఎన్నో ప్రశ్నలు వస్తాయి. అసలు విషయం చెప్పి లేనిసమస్యలు కొని తెచ్చుకోవడం కన్నా ఒక అబద్ధంతో తప్పించుకోవచ్చని?" ఎటో చూస్తూ అంది వందన.

"సమస్యలా?"

"కావా? ఎందుకు 'మెటీరియలైజ్' కాలేదు అని అడు తారు? నా దగ్గర జవాబు లేదుగా? నాకు తెలిస్తేకదా కార నే చెప్పేందుకు?" సూటిగా చూస్తూ అంది.

"కారణం...."

"మీరిప్పుడేం చెప్పక్కర్లేదు. పెళ్ళి చూపుల్లో కలుసుకు అని నిజంచెప్తే ఎందుకు వివాహం జరగలేదంటారు. ఏదో సమా చెప్పినా నమ్మకపోవచ్చు. ఎవరికివారు ఏవేవో ఊహి మనల్ని యిబ్బంది పెట్టవచ్చు. లైట్‌గా తీసుకొనేవారూ సీరియస్‌గా తీసుకొనేవారూ వుంటారు. ఏ విషయాన్ని ఎవర ఎలా తీసుకుంటారో తెలియనపుడు విషయంచెప్పి, చేజేతులా సృష్టించుకోవడం దేనికి?"

ప్రతివిషయాన్ని ఎంత సునిశితంగా ఆలోచిస్తుం

సమయస్ఫూర్తితో ప్రవర్తిస్తుంది.

"వందనా! మీకు తెలియని జవాబు నన్ను చెప్పనివ్వండి!"

"నో. నెవ్వర్‌మైండ్. గతం నాస్తి, గతం త్రవ్వుకోవడంలో లాభమేమీలేదు. నిజం చెప్పడంవల్ల యిప్పుడొరిగేది ఏదీ లేదు."

"ఓ. ప్లీజ్! మీ మంచితనంతో నన్ను మరింత హింసించకండి. జరిగిందానిలో నా తప్పు లేకపోలేదు...."

"ఇప్పుడు తప్పొప్పుల ప్రసక్తిదేనికి రాజా."

చటుక్కున నాలిక్కరుచుకుంది 'రాజా' అన్నందుకు.

"కాదు కాదు. నన్ను చెప్పనీయండి. మీలో ఆశలు రేపాను...."

"యూ ఆర్ మిస్టేకన్" మధ్యలోనే అందుకుంది వందన. "పూర్తి నమ్మకం ఆధారంలేకుండా ఆశలు పెంచుకోవడం నా స్వభావానికే విరుద్ధం. అయాం ప్రాక్టికల్ మైండెడ్" గంభీరంగా పలికింది వందన గొంతు.

"ప్లీజ్ మీకు గతంతో ప్రమేయం లేకపోవచ్చు. కాని నన్ను ...ప్పనిచ్చి నా మనసు తేలికపరుచుకొనే అవకాశం యివ్వమని ...ర్థిస్తున్నాను."

ప్రాధేయపడుతున్నట్లున్న అతన్నిచూపి, చూపుమరల్చి ...నంగా కూర్చుంది.

రాజశేఖర్ మస్తిష్కంలో గతం తాలూకు జ్ఞాపకాలు సినిమా ...గా తిరుగుతోంది. ఇన్నిరోజులుగా మనసులో బలవంతాన ...న ఆలోచనల తుఫాను విజృంభించినట్లుగా హృదయాన్ని ...వస్తున్నట్లుగా వుంది అతని కంఠం.

అమెరికాలోవున్న గోపాలరావు తన తమ్ముడైన రాజశేఖర్‌ను ...ర్'చేసి రప్పించుకొని తాను ఇండియాకు తిరిగి వచ్చేశాడు ...తో సహా. రాజశేఖర్ రిసెర్చి పూర్తిచేసి డాక్టరేట్ పొంది ...లో స్థిరపడేసరికి నాల్గేండ్లు పట్టింది. ఇంటినుంచి ఉత్తరం ...త్తరం రాసాగాయి ఒకసారి వచ్చిపొమ్మని. సంబంధాలు

చూస్తున్నాము. ఏకంగా పెండ్లి చేసుకుపొమ్మని తండ్రి ఆజ్ఞాపిస్తు న్నట్లు వ్రాయడంతో తప్పనిసరిగా రెణ్ణెల్లు సెలవు తీసుకుని వచ్చాడు ఇండియా.

వచ్చిన పదిరోజుల్లో ముగ్గురమ్మాయిల్ని చూశాడు. ఎవ్వరూ నచ్చలేదు.

ఆఖరి అమ్మాయిని చూడడానికి వైజాగ్ వెళ్ళాడు తల్లి దండ్రులతో.

వెళ్ళి కూర్చున్న ఐదు నిమిషాలకు కాఫీట్రేతో ఓ అమ్మాయి వచ్చింది.

"మా అమ్మాయి వందన" లాయర్ శ్రీనివాసరావ్‌గారు పరిచయం చేశారు.

తనకు నమస్కరిస్తున్న వందనను 'హలో' అంటూ పలుక రించి ఓక్షణం పరికించి చూసాడు.

తెల్లగా, పొడుగ్గా అందంగావుంది. మంచి విగ్రహపుష్టి కలిగివుంది.

"ఏంచేస్తున్నారు?" అడిగాడు శేఖర్.

"హౌస్ సర్జెన్సీ" కమ్మగా వుంది గొంతు.

"ఎప్పుడు పూర్తవుతుంది?"

"ఇంకో నెలలో"

"థాంక్‌గాడ్. పూర్తయింతర్వాత, పెండ్లిచేసుకుని తీసు డానికి అడ్డు వుండదు."

ఏమిటీ అప్పుడే తన ఆలోచనలు ముందుకెళ్తున్నా ఎందుకో ఆ అమ్మాయితో కాసేపు ఒంటరిగా మాట్లాడాలనిపి శేఖర్‌కు.

లాయర్‌గారిని అడిగాడు. ఆయన అనుమతించారు.

"ఈజిట్ ఆల్‌రైట్ విత్‌యూ?" వినయంగా శేఖర్ వందనను.

"యస్" అంటూ లేచింది.

"కావాలంటే కారులో వెళ్ళండి" వెనకనుంచి

శ్రీనివాసరావుగారు.

"నో. అయ్ ప్రిఫర్ వాకింగ్. వాటబవుట్ యూ?"

"లెటజ్ వాక్."

గేటుతెరిచి పట్టుకుని వందనను ముందుపోనిచ్చాడు. పిరుదుల దాకా వ్రేలాడుతూ నడుస్తున్నపుడు వయ్యారంగా ఊగుతున్న జడ ముచ్చటగా వుంది.

మాట్లాడుతూ నడుస్తున్నారు యిద్దరూ. అమెరికా వాతావరణం గురించి, భారతీయుల 'గెట్‌టుగెదర్' పార్టీలగురించి చెబుతున్నాడు శేఖర్.

మాట్లాడుతూ నడుస్తున్న వందన ప్రక్కన స్కూటర్ ఆపి ఎవరో పిలవడంతో తలత్రిప్పి చూసింది. ప్రొఫెసర్.

"గుడీవెనింగ్ సర్" విష్ చేసింది.

"గుడీవెనింగ్. మధ్యాహ్నం ఓ కేసు వచ్చింది. ప్రెగ్నెంట్ లేడీ. రేపు ఆపరేషన్ చేస్తాం. నీకు ఇంటరెస్టు ఎక్కువ కాబట్టి వస్తే కొన్ని క్రొత్త విషయాలు తెలుసుకోవచ్చు. పెక్యూలియర్ కేస్. ఒకే. అయ్ మస్ట్ గో నౌ."

"థాంక్యూ సర్" ప్రొఫెసర్ వెళ్ళిపోయాడు.

సిన్సియర్ అండ్ ఫేవరేట్ స్టూడెంటు కాబోలనుకున్నాడు.

ఓ ఫర్లాంగ్ దూరం నడిచేసరికి సామాన్లున్న బుట్టతో ఎదురు పడింది ఓ యువతి.

"హాయ్ వందన్. బొత్తిగా నల్లపూసవైపోయావు?"

"హాయ్! నేననాల్సిన మాట నువ్వంటున్నావు. నల్లపూసలు ...తున్న నీవు నల్లపూస వౌతావుగాని నేనెలా అవుతాను."

"నీకేం. బరువులా బాధ్యతలా? ఎంచక్కా చదువుకుంటూ ఎంజాయ్ చేస్తున్నావు. ఎంత జలసీగా వుందో నిన్ను ...ంటే."

"ఏమిటే అలా చూస్తున్నావు?" తనను ఎగాదిగా చూస్తున్న ...నడిగింది.

"ఆహా! ఏంలేదు. బరువు బాధ్యతలన్నావు కదా! బరువు ...బంధం

మాత్రం కనబడుతోంది ఆ బాస్కెట్‌లో. మరి బాధ్యత లెక్కడా అని చూస్తున్నాను?"

"సంతోషించాం తెలివికి."

"హుం. ఎంతగా చెప్పానపుడు చదువుకోవే అని. చెవికెక్కితే కదా! ఊహుం. పెళ్ళి పెళ్ళని కలవరించిపోయావు. ఇప్పుడీ సంసార సాగరంలో మునిగి తేల్తున్నావు?"

"ఏదో ఫ్రెండ్ కదా అని వెళ్ళబోసుకుంటే చెప్తుతావేం?" కోపం నటిస్తూ అంది.

"నీకేం కష్టాలున్నాయే తల్లీ. చాలా సుఖంగా, సంతోషంగా వున్నట్లున్నావు? పెళ్ళికి పూర్వం పేరుకుతగ్గట్టు లతలాగా వున్నావు. ఇప్పుడేమో ..." రుబ్బురోలులాగా వున్న స్నేహితురాలిని చూసి వెక్కిరించింది.

"ఏం సంతోషం లెద్దూ" నిర్లిప్తంగా అంది.

"లతా నువ్వు పేరు మార్చుకోకూడదూ?" హఠాత్తుగా అంది వందన.

"అదేం?" తెల్లబోయింది లత.

"ట్యూబ్‌లైట్ ఎక్కడో. నీకాపేరు యిప్పుడు సరిపోవడం లేదు అందుకని."

"బాబ్బాబు. డాక్టరువికదా. ఏదో కాస్త మాత్రలిచ్చి పుణ్యం కట్టుకోవే."

"ఒకటేమార్గం దానికి."

"ఏమిటది" తొందరగా చెప్పు అన్నట్లు చూపింది.

"ఠుబ్బరంగా రెండు పూటలా తిండి మానేసి, వంచిన నడుం ఎత్తకుండా పనిచేయడం. చిరుతిండ్లు తినేవ్‌సుమా!" నవ్వు కుంటూ చెప్తున్న ఆ తీరుకు శేఖర్ నవ్వకుండా ఉండలేకపోం

"ఏడిశావ్. ఏదో ఫ్రెండ్‌వి కదా సలహా విస్తావేమో నీకూ అలుసైపోయాను. ఆయనా అంతే లావుగా వున్నానే రిస్తారు."

"నేను సమస్యా పర్కిారం చెప్తున్నాను కదా!

విషయంలో స్ట్రిక్ట్‌గా వుండమని."

"పోదూ ఏం డైటింగో ఏమో! ఎక్కడలేని నీరసం వస్తుంది. నేను పడుకుంటె ఇంట్లో పనులు ఎవరుచేస్తారు? పిల్లల్ని ఎవడు చూస్తాడు?"

"అదేం మీ ఆయన చేయరా యీ పనులన్నీ?" అమాయకంగా మొహం పెట్టింది.

'ఎంత చిలిపితనం' వీళ్ళ సంభాషణ వింటూ అనుకున్నాడు శేఖర్.

"ఆఁ ఆఁ! చేస్తారు. చేస్తారు? పనిలో సాయం రమ్మంటే రారుగాని, వంటకు వంకలు పెట్టడానికి తయారు. ఇల్లు శుభ్రంగా వుండదని గోల. పిల్లలున్న యిల్లు ఎలా వుంటుంది మరి? పోనీ పిల్లలనైనా చూసుకుంటారా అంటే అదీలేదు. పైగా విసుగు కోపం...."

ఉక్రోషంగా చెప్తున్న లతను చూస్తే జాలనిపించింది.

"నే చెప్పానుకదా అప్పుడే. సంసారం అనే ఉబిలోకి అంత తొందరగా దిగకే అని. కనీసం పిల్లలనయినా కొంచెం లేట్‌గా వాల్సింది" పెళ్ళయిన ఐదేండ్లలో ముగ్గురు పిల్లల తల్లి అయింది త.

"పోదూ బడాయి. పెళ్ళిలో ఎంత మాజా ఉందో చేసుకుని డు తెలుస్తుంది పిల్లల అల్లరి ఎంత ముచ్చటగా ముద్దొస్తుందో" వశంగా అంటున్న లతను చూసింది.

"ఇందాక మాట్లాడిన నాలుకేనా యిది."

"ఆహాఁ. ఇదే నాలుక. దేని దారి దానిదే. ఏ మాటకా మాటే వాలి. వస్తాను బాబూ. ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. అఫీసునుంచి వచ్చి ఎదురు చూస్తుంటారు. పాపం! కాఫీ లేదో?" శేఖర్‌వైపు ఓ క్షణం చూసి అర్ధయుక్తంగా కన్నుగీటి వెళ్ళిపోయింది లత.

ఁ ఆడదాని జీవితమే యింత కాబోలు! ఒకవైపు బరువు మోస్తూ బాధలు అనుభవిస్తూనే అందులోనే ఆనందం

థం (2) 

వెతుక్కుంటుంది.

ఆడదాని నరాల్లో వున్న మమతానురాగాలలాంటివి. ఆలోచనలతో నడుస్తున్న వందన శేఖర్ తనను జబ్బపట్టి బలంగా లాగడంతో ప్రక్కనుంచి కారు సర్రున దూసుకుపోవడంతో ఉలిక్కిపడింది.

"అదేం అంత పరధ్యానంగా నడుస్తున్నారు? కాస్తలో ప్రమాదం తప్పింది."

"థాంక్సు మిస్టర్ శేఖర్. ఏదో ఆలోచిస్తూ నడుస్తున్నాను."

"ఇంక వెనక్కి తిరుగుదామా?" ఆగి అడిగాడు.

"ఏం భయంవేస్తోందా నేనెక్కడ ప్రమాదంలో చిక్కుకుంటానో అని. లేక ఎవరైనా ఫ్రెండ్సు కనబడితే మీ ఉనికే మరచి పోతానని?"

"అబ్బే అదేంలేదు. మీ మాటలు విన సొంపుగా వున్నాయి. ఇంట్లో వాళ్ళు ఎదురు చూస్తూంటారేమోనని."

"పదండి" వెనక్కు తిరుగుతూ అంది.

సినిమాల గురించి మాట్లాడుతూ నడిచారు.

"మీ అభిప్రాయం ఏమిటి నా గురించి" హఠాత్తుగా అడిగా[illegible] శేఖర్.

"మీ అభిప్రాయం ఏమిటి" తిరిగి ప్రశ్నించింది.

"ముందడిగింది నేను" ఓ క్షణం ఆగాడు. "పోనీ[illegible] నేనే చెప్తాను. మీరు నాకు నచ్చారు. మీ వాళ్ళతో చెప్తాను. ఇష[illegible] చెప్పండి మీరు."

"వెల్. మీరు మంచివారనిపిస్తోంది" సూటిగా చెప[illegible] అంది వందన.

"అంతేగాని మీ కిష్టమని చెప్పరన్న మాట" [illegible] చూస్తూ అన్నాడు.

"ఇంకా స్పష్టంగా చెప్పాలా" చిరుసిగ్గుతో అంది[illegible]

వాళ్ళు వెళ్ళిపోయారు.

రాజశేఖరం తల్లిదండ్రులకు కూడా వందన నచ్చి[illegible]

అంగీకారం తెలియజేస్తూ ముహూర్తం నిర్ణయించమని వ్రాసి పోస్ట్ చేయబోతుండగా రాజశేఖర్ మేనమామ దిగాడు ఊర్నుంచి.

సంగతి తెలుసుకుని పోస్ట్ చేయవద్దని, బంగారంలాంటి సంబంధం వుందని, స్వయంగా జమీందారే రాజశేఖర్ అర్హతలు విని కబురంపాడని చెప్పాడు.

శేఖర్ తల్లిదండ్రులు అటు మొగ్గినా, రాజశేఖర్ మటుకు ససేమిరా అన్నాడు. నాకు అన్ని విధాల వందన నచ్చింది. వేరే ప్రయత్నం చేయవద్దన్నాడు.

మేనమామకు కోపం వచ్చింది. " 'సిరిరామొకా లద్దు' తాననే నీలాంటి మూర్ఖుడు ఎవడూ వుండడు. అతడెవరనుకున్నావ్. జమీందారు. కోటికి పడగలెత్తినవాడు. కేవలం కట్నం కింద 10 లక్షలు యిస్తాడట. అది మీరెలా ఖర్చుచేసినా మీ యిష్టమే. అతని తదనంతరం ఆ స్తి కూతురికి కొడుక్కూ చెరిసగం పంచుతాడట. ఏం డబ్బంటే చేదుగావుందా? ఎవరికైనా అదృష్టం ఒకసారే తలుపు తడ్తుందిరా. వివేకం తెచ్చుకుని తలుపు తెరచి ఆ అదృష్టాన్ని అందుకున్నావా సరే. లేకపోతే జీవితాంతం కుమిలిపోవలసి వస్తుంది దృష్టాన్ని చేజేతులా జారవిడచుకున్నందుకు.

అన్ని లక్షలు నీవు ఎన్నినాళ్లు కూడబెడితే వస్తుందిరా?"

మామ కళ్ళలో నిరసన.

ఈ మాటలన్నీ విన్న శేఖర్‌తల్లిదండ్రులకు ఆశ కల్గింది. క్కా ఆ లక్షలతో ఎదిగిన తమ యిద్దరి కూతుళ్ళకు మాంచి ధం తేవచ్చు.

అమ్ముడుపోవడం యిష్టంలేని శేఖర్ మెదలకుండా వున్నాడు. ండ్రి కూడా నచ్చజెప్పాడు ఈ సంబంధానికి ఒప్పుకుని తన పెళ్ళిచేసే అవకాశం కల్పించమని.

ర్ నోరు తెరవలేదు.

య్యే గోపాల్ కూడా అదేమాట. "సిల్లీగా స్టుపిడ్‌గా . వారితో సంబంధం అంటే మాటలా? ఇంకొకరైతే ివుందురు."

"కాని అన్నయ్యా! వందన నాకు నచ్చింది. ఆ అమ్మాయికి మాట కూడా యిచ్చాను" నిస్సహాయంగా చూశాడు.

"ఓస్ మాటేగా! మనసు పారేసుకోలేదుగా."

ఎంత తేలిగ్గా తీసిపారేశాడు.

"అయినా నీవా అమ్మాయిని ప్రేమించలేదు. అన్యాయం చేయలేదు. అలాంటప్పుడు నీవు బాధపడటానికి ఏముంది యిందులో."

ఇష్టపడటం ఓ రకంగా ప్రేమ కాదా!

ప్రేమకు నాంది ఆకర్షణ అయితే తాను ఆ అమ్మాయిచే అన్నివిధాలా ఆకర్షింపబడ్డాడు కదా!

'పైగా నువ్వంటే నాకిష్టం. పెళ్ళి చేసుకుంటా'నని మాట యిచ్చి, అది నిలబెట్టుకోకపోవడంకంటే అన్యాయం యింకేముంది? ఆ అమ్మాయిపట్ల అలా ప్రవర్తించడానికి తనకు మనసు రావడం లేదు.

"ఏంరా ఇంకా ఆలోచిస్తున్నావ్."

"వాళ్ళేమయినా అనుకోరూ? నా అభిప్రాయం వాళ్ళకు చెప్పేసి వుంటుంది కూడా అమ్మాయి" ఆఖరిసారిగా ప్రయత్నించాడు.

"పిచ్చిపిచ్చిగా ఆలోచించి మనసు పాడుచేసుకోకు. వ యింకా ఏ విషయం రాయందే ఆశలు పెంచుకుంటే అది వారిత అయినా ఆడపిల్లలను కన్నవాళ్ళకిలాంటివి పరిపాటే. వాళ్ళేం పట్టించుకోరు" కసరుకున్నట్లన్నాడు గోపాల్.

"హుం. పరాయి తల్లిదండ్రులు కన్న ఆడపిల్లలను అనా చేయడానికి వెనుకాడరు. కాని వీళ్ళ తాపత్రయం కూడా త పిల్లలగురించే కదా! ఛీ ఎంత స్వార్థం!

తల్లి కల్పించుకొంది. "అమ్మాయి అందంగా వీడి అనుమానం ఏమో" అన అనుమానం బయటపెట్టిం

"ఆ ఏడుపేదో ముందే ఏడవరాదూ? నాకు తె అడుగుతారని. అందుకనే ఫోటో ఒకటి వెంటతెచ్చాను బాగా కళ్ళుతెరచి చూడండి. అపరంజి బొమ్మ."

తల్లి అందుకుంది "లక్ష్మీదేవిలా ఎంత అంద

నిజంగా బంగారు బొమ్మ."

'ఏదీ ఏదీ' ఒకరిపై ఒకరుపడి చూశారు చెల్లెళ్ళిద్దరూ.

"ఎంత బ్యూటిఫుల్‌గా వుందో-కాస్త హేమమాలినిలాగా లేదూ" పెద్దచెల్లెలికి సినిమా పిచ్చి.

"ఎంత హుందాగా ఠీవిగా వుందో చూడు. ఎక్కడ పోతుందీ ఆ జమీందారీ అభిజాత్యం" చిన్నచెల్లెలి భావుకత.

గోపాల్రావు అందుకుని చూశాడు"నిజంగా ఎంత ఎలిగెంట్‌గా వుంది."

తండ్రి కందించాడు. ఓ క్షణం చూశాడు ఫోటోవంక తండ్రి. మాటల్లోకాక కళ్ళల్లో చూపించాడు మెచ్చుకోలు.

తండ్రి నుంచి అందుకుని తమ్ముడికిచ్చాడు గోపాల్.

"చూడు. బాగా చూడు. అప్పుడు చెప్పు నీ అభ్యంతరం"

చేతిలోని ఫోటోవంక చూశాడు.

ఎంతో అందంగా వుంది. ప్రక్కనే వందనను పోల్చిచూశాడు:

ఏం? వందనలో ఏం తక్కువ?

ఈ అమ్మాయి జడ అల్లకుండా వదిలింది. నడుందాకా వుంది

...టు. వందన జడ పొడుగ్గా సల్లత్రాచులా ఎంత అందంగా వుంది.

ఈ అమ్మాయి కళ్ళల్లో చిలిపిదనం వుంది. కాని వందన

...కపోయినా సదా నవ్వినట్లుండే ఆ కళ్ళు ఆ పెదవులు యెంతో

...జ్ఞంగా వున్నాయి. అదేకదా తననాకర్షించింది.

"ఏరా ఏమిటిరా నీ అభిప్రాయం? ఇంకా ఆలోచనే? వందన అన్నివిధాలా ఎక్కువే కదా?"

"కాదు. ఒక విషయంలో మాత్రమే. అదే డబ్బులో" కసిగా

...న్నాడు మనసులో.

...ఎక్కడో పిచ్చివాడిలా వున్నాడు" కోపం పట్టలేక అన్నాడు

...క తండ్రి ఊరుకోలేకపోయాడు. "చూడు శేఖర్. మాకు

...లా నచ్చింది యీ సంబంధం. ఇదే ఖాయం చేయ

...తండ్రిగా తన హక్కు అధికారం వుపయోగించాడు.

...ం

శేఖర్ కొన్నిక్షణాలు అందరి మొహాల్లోకి పరికించి చూశాడు. మేనమామ కళ్ళల్లో నిరసన.

తండ్రి కళ్ళల్లో ఆజ్ఞ, అధికారం.

అన్నయ్య కళ్ళల్లో 'ఛాన్సు పోగొట్టుకోకనే హెచ్చరిక'. తల్లి కళ్ళల్లో వేడికోలు. కూతుళ్ళ భవిషత్తుకోసం తల్లి మనసు పడే ఆరాటం చూడగలిగాడు. పెద్దచెల్లి కళ్ళల్లో భావిగురించి బంగారు కలల తాలూకు ఆశల తళతళ.

చిన్నచెల్లి కళ్ళల్లో 'మా జీవితాలు నీ చేతిలో వుంది-పాల ముంచినా నీళ్ళ ముంచినా నీదే భారం. ఆశపడటం తప్పా' అనే భావం చదివాడు.

హుఁ....డబ్బు....డబ్బు.

ఎంతటి గారడీ చేస్తూంది.

ఎన్ని ఆశలు ప్రేరేపిస్తోంది ఒక్కొక్కరిలో.

వందన! వందన ఆత్మవిశ్వాసం గల వనిత. భావిని నందన వనంగా తీర్చిదిద్దుకునే ఆత్మస్థైర్యం, వివేకంగల మనిషి అన్పిస్తోంది.

ఒక యువతికిచ్చిన మాట నిలబెట్టుకొనేందుకు తన కుటుం సభ్యుల ఉసురుపోసుకుని, వారిదృష్టిలో చులకన అయి చెడ్డవాడు స్వార్థపరుడుగా నిలిచిపోవడంకన్నా, తన కుటుంబ సభ్యుల సంతో కోసం తనిచ్చిన మాట పోగొట్టుకోవడం నయం కదూ!

శేఖర్ మౌనం అందరికి రంపపు కోతలాగా వుంది. భ రానిదిగా వుంది.

ఇంతకుముందున్న భావాలు మారిపోయి అందరి క అసహ్యం తొంగిచూడబోతోందని గమనించి శేఖర్ నోరు ఆఖరికి!

"మీరు నిర్ణయించి తర్వాత నే చెప్పేదేముందిక మీ యిష్టప్రకారమే చేయండి" వాళ్ళ మొహాల్లో తాండవ ఆనందం తాలూకు ఉల్లాసాన్ని చూడకుండా తన గ పోయాడు.

రాజశేఖర్ సుష్మాల వివాహం వైభవోపేతంగా జరిగింది. అడుగడుగునా జమిందారుగారు జరిపిన మర్యాదలు, యిచ్చిన లాంఛనాలు, ఆయన వైభవం చూపిన రాజశేఖర్ బంధువులకు తల్లి దండ్రులు అమితానందం కలిగింది.

జమిందారుగారు సంతృప్తిగా నిట్టూర్చారు. అసలు సుష్మా పుట్టింతర్వాత ఆయనను అదృష్టం మరింతగా వరించింది. అందుకనే సుష్మా అంటే ఆయనకు ప్రాణం. అతి గారాబంగా పెరిగిన సుష్మా చాలా పెంకిగా తయారవడం ఆయనను కాస్త బాధించింది. కాని మందలించలేక పోయాడు.

బి.ఏలో చేరిన సుష్మాకు చదువులో ఏ మాత్రం శ్రద్ధలేదు. ఆ కారణంగా స్ట్రిక్టుగావున్న లెక్చరర్లతో గొడవపడి చదువు మానేసి వచ్చేసింది. అయితే సుష్మాకు చిన్నప్పటి నుండి 'ఫారిన్' వెళ్ళాలనే కోరిక బలంగా వుంది. తండ్రిని పోరసాగింది ఫారిన్ పంపమని. తనకున్న ధనంతో పలుకుబడితో వీసా సంపాదించగలడు. కాని ఒంటరిగా కూతుర్ని పంపడానికి యిష్టపడలేదు. కనీసం చదువులో శ్రద్ధవున్నా చదువుసాకుతో పంపేవాడు.

అందుకనే తగిన వరుడికోసం ప్రయత్నించాడు. ఫారిన్‌లో ద్యోగం చేసే అబ్బాయి అయితే తన కూతురి కోర్కె సులువుగా తుందని ఎదురుచూస్తున్న సమయంలో దైవికంగా రాజశేఖర్ నమామ శేఖర్ విషయిం చెప్పడం జరిగింది.

రాజశేఖర్ అన్ని విధాల జమిందారుకు, సుష్మాకు నచ్చాడు. మైన తన కూతురికి తగినవాడనిపించాడు. అందుకే వారు త సంపన్నులు కాకపోయినా తనకూతురి కోర్కె తీరే ం వుందని తెలిసి జమిందారు శేఖర్ సంబంధాన్ని వెంటనే న్నాడు.

ారిన్ వెళ్ళేముందు అత్తవారింట్లో నాల్గురోజులుండడానికి సుష్మా.

జుకోరకంగా అలంకరించుకునేది. ఆడబడుచులతో మాట్లాడేది కాదు.

పాతకాలవు మనిషైన అత్తగారికి కోడలి అలంకరణ కాస్త ఎబ్బెట్టుగా, వింతగా తోచేది. కాని పైకిమాత్రం ఏమీ అనేదికాదు.

స్వతహాగా అందమైనదైనా, వదిన అలంకరణ కోసం అన్నన్ని గంటలు ఎందుకు గడుపుతుందో అర్థమయేది కాదు ఆడ బడుచులకు.

ఎలా అలంకరించుకున్నా వదినకు బాగుంటుందని మురిసి పోయేవారు.

తర్వాత ఫారిన్ వచ్చేశారు. పెళ్ళయిన కొత్త. అందమైన భార్య. ఫారిన్‌లో సుందరమైన ప్రదేశాలకు కొదవలేదు. రోజుకో చోటుకు వెళ్ళేవారు. రాజశేఖర్ తాత్కాలికంగా వందనను మరిచాడు. సుష్మా కాన్వెంట్‌లో చదవడంవల్ల చక్కటి ఇంగ్లీషు మాట్లాడేది.

* * *

"మీరు నమ్మితే నమ్మండి ఇది మాత్రం నిజం" చెప్పడం ఆపాడు శేఖర్.

నమ్ముతాను అన్నట్లు చూపింది వందన.

"మీకిచ్చిన మాట నిలబెట్టుకోలేకపోయినందుకు నేనెంతగా ఫీల్ అయ్యానో? మీరు 'హర్టు' అయ్యారో లేదో కాని నేన మాత్రం హర్ట్ అయ్యాను."

ఓ క్షణం కళ్ళు మూసుకుంది వందన.

తను హర్ట్ అవలేదూ?

ఎంతగా ఎదురుచూసింది ఆ రోజుకోసం....

"ఎక్స్క్యూజ్ మి సర్" వందన ఉలిక్కిపడింది.

ఎవరో స్టూడెంట్ శేఖర్‌తో అంటున్నాడు.

"ప్రొఫెసర్ ఎడ్వర్డ్ వాన్ట్సు టు సీ యు సర్" అ పోయాడు ఆ స్టూడెంట్.

"వస్తాను వందనా సీ యూ" చెయ్యూపుతూ వెళ్ళిపో

ఆలోచనలతో వంటరిగా మిగిలిపోయింది వందన.

రాజశేఖర్! ఎంత చక్కటి పేరు.

పొడుగ్గా హుందాగా వున్న విగ్రహం.

తను మెడిసిన్‌లో చేరినదగ్గర్నుంచీ 'ఫారిన్' వెళ్ళాలనే కోరిక ఈ రూపంగా తీరుతుందని ఎంత మురిసిపోయింది.

అయాచితంగా అదృష్టం భర్త రూపంలో వెదుక్కుంటూ వస్తోందని ఎంత పొంగిపోయింది.

కాని.... కాని.... రాజశేఖర్ వాళ్ళు వేరే సంబంధం చూసుకున్నారనగానే తన మనసే మూగపోయినట్లనిపించింది.

మొగ్గ తొడగబోతున్న చెట్టును సమూలంగా పెరికినట్లు, చిపురింపబోచున తన ఆశలు పుటుక్కున తెంపేసినట్లనిపించింది.

ఎంత తీయటిమాటలు చెప్పి మభ్యపరిచాడు. అంతమాట నిలుపుకోలేనివాడు యెందుకు మాటివ్వాలి? ఒక్కసారిగా అతనిమీద కోపం, అసహ్యం పేరుకుంది మనసులో.

కాని వెంటనే తనలోని వివేకం మేల్కొంది. తన పరంగానే ఆలోచిస్తున్నందుకు సిగ్గుపడింది. అదొక కలగా భావించి మరిచిపోవాలనుకుంది. కాని ఆ కల పదే పదే కనులముందు సాక్షాత్కరించి మనసులో లీలగా వున్న గాయాన్ని రేపినట్లయ్యేది. అపను మరి మెడిసిన్ చదివిన ఐదేండ్లలో తనకు వచ్చిన వందలకొలది ప్రేమలేఖలు సాధించలేనిది ఇతడితోడి ఓ అరగంట పరిచయం సాధించింది. తన కోలిగ్స్‌ల ప్రొపోజల్స్ కదలించలేని తన హృదయాన్ని ఇతడు కదలించగలిగేడు.

ఒక్కొక్కరిని చూస్తున్నపుడు కలిగే భావాలలాంటివికాబోలు. ఎందుకో యీ సంఘటన తనకు తెలియకుండానే తన అహాన్ని చుపరిచింది.

అందుకనే వేరే సంబంధం చూస్తున్న తండ్రిని వారించి, చి ఎమ్.డి. లో చేరింది.

ఎమ్.డి. పూర్తిచేసి లెక్చరర్‌గా చేరింది. తండ్రి నరేంద్ర ం తెచ్చినపుడు అభ్యంతరం చెప్పలేదు. మనస్ఫూర్తిగా ంది.

ను ప్రాక్టికల్ మైండెడ్‌గా వుండాలనుకుంది. క్రమంగా మరచిపోయింది.

జీవితం ఓ ప్రయాణంలాంటిది. ఆ ప్రయాణంలో యెన్నో మజిలీలు. అతనితో పరిచయం ఓ మజిలీ. దాటిపోయిన మజిలీని జ్ఞాపకం ఉంచుకోవలసిన అవసరంలేదు.

నరేంద్ర పనిచేస్తున్న కంపెనీవారు మిషినరీలో మెలుకువలు తెలుసుకువచ్చేందుకు ఎక్జిక్యూటివ్ ఇంజనీరైన నరేంద్రను కంపెనీ ఖర్చుతో పంప నిశ్చయించినపుడు తన కలలు ఫలిస్తున్నాయని మురిసిపోయింది.

రాజశేఖర్‌ను ఇక్కడ చూచేంతవరకు తనకతడు లీలా మాత్రంగాకూడా గుర్తుకురాలేదు. విచిత్రం, ఇతన్ని చూచిన క్షణం నుంచీ తనలో ఏదో కలవరం!

మరుపుకు వచ్చిందనుకున్న ఆ కల ఉండుండి జ్ఞాపకంవచ్చి తీయటిబాధను కలిగిస్తోంది.అతన్ని తిరిగిజీవితంలో కలుస్తాననుకోలేదు.

"హల్లో మేడం"

గాఢ సుషుప్తిలోంచి మేల్కొన్నట్టు చూచింది.

ఎదురుగా నీలికళ్ళతో నవ్వుతూ ఫిలిప్స్....తన కొలీగ్.

"హల్లో" చిరుగా నవ్వుతూ లేచి నిల్చుంది.

"నో క్లాసెస్?" ప్యాంటు జేబులోకి చేతులు పోనిచ్చి ప్రక్కగా నడుస్తూ అడిగాడు.

"నో"

"గోయింగ్ హోమ్ దెన్? లెట్ మి డ్రాప్ యూ"

కారు పార్కుచేసిన వైపు నడుస్తూ అన్నాడు.

లిప్తకాలం సంశయించింది.

"ఓ.కె." ఫ్రంట్ డోర్ తెరచిపట్టుకుని వుండటం వచ్చి కూర్చుంది.

"మీరు చీరల్లో చాలా అందంగా కన్పిస్తారు." యె నుంచో మనసులో వున్న మాట చెప్తున్నట్టుగా రోడ్డుమీద అన్నాడు ఫిలిప్స్.

ఆ తీరుకు నవ్వు వచ్చింది. "థ్యాంక్యూ" అంట వైపు చూసింది.

ఆరడుగులు వుండి బలంగా వున్న యితని చుట్టూ కాలేజ్ అమ్మాయిలు తిరగడం గమనించింది వందన.

* * *

'గెట్ టుగెదర్' పార్టీ సందర్భంగా కోలాహలంగా వుంది హాలంతా. పాశ్చాత్య సంగీతాని కనుగుణంగా డాన్సు చేసేవాళ్ళు చేస్తున్నారు. త్రాగుతూ జోక్‌చేసుకుంటూ నవ్వేవాళ్ళు నవ్వుతున్నారు.

శేఖర్, డాక్టర్ పాయ్, వందన మాత్రం ఓ టేబుల్ చుట్టూ కూర్చుని క్రితంరోజు కాలేజీలో జరిగిన మీటింగ్ గురించి చర్చించు కుంటున్నారు.

అప్పటికే నరేంద్ర తాగివున్నాడు. తూలుతూ వచ్చాడు వందన దగ్గరికి.

"కమాన్ డార్లింగ్! హేవ్ ఎట్‌లీస్ట్ దిస్ సాఫ్ట్ డ్రింక్" చేతిలో బీరు గ్లాసు వంక చూపిస్తూ అన్నాడు.

"నోప్లీజ్" మృదువుగావున్నా ఖచ్చితంగా పలికింది స్వరం.

"ఓ....హనీ! డోంట్ బి సిల్లీ! నథింగ్ విల్ హాప్పెన్.... కమాన్....హావిట్" పెదవుల కందించబోయాడు.

"ఐ సే నో.... ప్లీజ్ నరేన్. మీకు తెలుసు నా మనసుకు విరుద్ధంగా నే నెప్పుడూ ఏదీ చెయ్యనని" అతని చేతిని ప్రక్కకు తోస్తూ అంది.

"కంపెనీ సేక్."

"ఐ కెన్ సీ యూ హేవ్ ఎ వెరి గుడ్ కంపెనీ. నో నీడ్ ఆఫ్ మై కంపెనీ" సూటిగా అతని కళ్ళల్లోకి చూసింది.

అతనికి తెలుసు ఆ చూపు కర్థం.

తన నిర్ణయం సడలించుకోదు.

"ఒట్టి బుద్ధావతారం" చిరాకుపడుతూ వెళ్ళిపోయాడు.

"ఐ ఎప్రీషియేట్ యువర్ గట్స్ మై చైల్డ్. ఐ లైక్ యూ" పాయ్ వందనవైపు ప్రశంసాపూర్వకంగా చూస్తూ అన్నాడు.

నవ్వి వూరుకుంది వందన.

తన దగ్గరికి గ్లాసుతో తిరిగివచ్చిన నరేంద్రను చూసి పగలబడి

నవ్వింది సుష్మ.

"అయితే నీ పెళ్ళాంచేత బీరుకూడా త్రాగించలేకపోయా వన్నమాట. ఈ భాగ్యానికి అమెరికా రావడం దేనికి?" వ్యంగ్యం తొంగిచూస్తోంది మాటల్లో.

నరేంద్ర మొహం యెర్రబడింది కోపంతో. అవమానంతో ఆ మొహం వివర్ణమవడం గమనించింది.

"ఓ టేకిట్ యీజీ డియర్. ఐవాజ్ ఓన్లీ జోకింగ్. కమాన్, లెటజ్ డాన్స్" నరేంద్ర చేయి తన నడుంచుట్టూ వేసుకుంటూ అంది.

"కెన్ ఐ హేవ్ ఎ డాన్స్ విత్ యూ" మర్యాదగా అడిగాడు గుప్తా వచ్చి.

ఓ క్షణం సంశయించింది.

"నా కంతగా రాదు" తప్పించుకో జూసింది.

"ఓ డోంట్ ఫస్. నరేంద్ర చెప్పాడు మీకు వచ్చని."

అవును మరి బలవంతంగా నేర్పించాడు.

బీరుగ్లాస్ మీదుగా శేఖర్ వందనతో చూపులు కలిపి వెళ్ళమని సంజ్ఞ చేశాడు.

అయిష్టంగా లేచి వెళ్ళింది.

కాళ్ళు యాంత్రికంగా డాన్సు కనుగుణంగా కదుల్తున్నాయి.

హుఁ వ్యక్తి తన యిష్టంగా సంపూర్ణంగా బ్రతకలేడేమో. కొన్ని తనకిష్టం లేకపోయినా తప్పనిసరిగా చేయాల్సివుంటుంది. అందుకనే మానవుని 'సంఘజీవి' అన్నారు.

అయినా తనది మరీ చాదస్తం ఏమో.

అందుకనే డాన్సు నేర్చుకోవడానికి అంగీకరించింది.

అయితే మరీ విచ్చలవిడిగా తిరగడం తనకు నచ్చదు.

అవాంఛనీయ పరిస్థితులు కోరి తెచ్చుకోవడం ఎందుకు?

"యూ ఆర్ సింప్లీ బ్యూటిఫుల్" మత్తుగా పలుకుత మీదకు వంగుతున్నట్లనిపిస్తే ఆలోచనల్లోంచి వులిక్కిపడి తేర

ఇంకా తన మొహంమిదకు వంగబోతున్న గుప్త మొహం తప్పించుకుంటూ 'మిష్టర్ గుప్తా' వారింపుగా అంది

"ప్లీజ్. ఓన్లీ వన్స్. డోంట్ సే నో డార్లింగ్" త్రాగుడు మైకంలో తపనగా బలవంతంగా మొహం తనవైపు త్రిప్పుకో బోయాడు గుప్త.

కోపం అహస్యం పట్టలేకపోయింది వందన. విసురుగా చెయ్యెత్తింది. బలంగా గుప్త చెంపను తాకబోయిన చేయిని ఎవరో గట్టిగా పట్టి ఆపడంతో ప్రక్కకు తిరిగి చూసింది.

శేఖర్!

"డోంట్ క్రియేట్ ఎ సీన్. ప్లీజ్ కమాన్" చెయ్యిపట్టి లాక్కుపోయాడు. ఇద్దరు ముగ్గురు తనవైపు చూడటం గమనించి పెదవులమీద నవ్వు పులుముకుని.

"బై మిస్టర్ గుప్తా" అని గుప్తకు చెప్పి శేఖర్‌తో డాన్సు చేయనారంభించింది.

డాన్సు చేస్తూ చుట్టూ పరికించి చూసింది.

చాలామంది త్రాగుడు మైకంలో వుండి డాన్సు చేస్తున్నారు. ఎవరి పరవశంలో వారున్నారు.

నరేంద్ర సుష్మా నవ్వుతూ చాలా హుషారుగా డాన్సు చేస్తున్నారు.

ఏ విషయాన్ని యెవరూ పెద్దగా పట్టించుకొనేట్లు లేరు.

"ఏమిటి అలా చూస్తున్నారు" సుష్మాకేసి చూస్తున్న వర్మ నడిగాడు రాయ్.

మాట్లాడకుండా గ్లాసు నింపుకొన్నాడు వర్మ.

"వాంట్ టు డాన్స్ విత్ సుష్మా" మనసులోని మాట కని ...ాడు రాయ్.

"నో యూజ్. అడిగాను. నరేంద్రకు మాటిచ్చానంది" వర్మ ...కులో నిరాశ.

ఎన్నిరోజులయిందో సుష్మాను ఏకాంతంగా కలుసుకొని.

"ఎట్ ప్రెజంట్ షి హాజ్ నో హార్ట్ ఫర్ ఎనీవన్" రాయ్ ...తో విరుపు.

"యా! షి యీజ్ ఆల్ ఎ టెన్షన్ ఫర్ నరేంద్ర" తనతో

డిన్నర్ ఇన్విటేషన్ తిరస్కరించిందనే కోపం వర్మ గొంతులో ధ్వనించింది.

"హౌ అబౌట్ వందన" వందన రూపు మనసులో తళుక్కుమంది రాయ్‌కు.

"ఓ, నో! షి యీజ్ ఫైర్. పట్టుకుంటే కాలేను. బి కేర్‌ఫుల్" రెడ్డి గొంతులో హెచ్చరిక.

"ఏం! ఎప్పుడైనా ట్రై చేసి సత్కరింపబడ్డావా?" వర్మ కంఠంలో కుతూహలం.

"మీ ఆంధ్రా అని ప్రిఫరెన్స్ యిచ్చింది కాబోలు" రాయ్‌లో కించిత్తు జలసీ.

అదో జోక్ అయినట్లు వర్మ బిగ్గరగా నవ్వాడు. రాయ్ శ్రుతి కలిపాడు.

హుఁ పెద్దచదువులు చదివారు. ఎందుకు? ఆడదాన్ని చూస్తే చులకనగా మాట్లాడక మానరు.

"డోంట్‌టాక్ నాన్సెన్స్."

"అదేం?"

"ఓ స్టాపిట్" రెడ్డి మొహం అవమానంతో ఎర్రబడింది.

"ఇందాక గుప్తా సిల్లీగా బిహేవ్ చేయబోతే చెంపపెట్టుతో సత్కరించపోయింది. నమ్మకం లేకపోతే మీరు ట్రైచేసి చూడండి."

"ఓ లీవిట్. శేఖర్ వచ్చాడా?" మాట మారుస్తూ అన్నాడు వర్మ.

"ఎందుకో సుష్మ శేఖర్‌కు తగిన భార్య కాదనిపిస్తుంది మరీ అంత విచ్చలవిడితనమా?—" రాయ్.

"నేనైతే అలాంటి భార్యను ఓ క్షణం కూడా భరించ? సోషల్‌గా ఉండటం ప్రోత్సహిస్తానుగాని అతనితో గడప సహించలేను" వర్మ.

అవునుమరి. సుష్మ వీళ్ళతో గడపడం లేదిప్పుడు. మన ఉక్రోషం మాటలరూపంలో బయటకు వస్తోంది!

"దేర్ కారెక్టర్స్ ఆర్ పోల్స్ ఎ పార్ట్."

"సుష్మ యెంత జోవియల్ సెక్సీ టైపో శేఖర్ క్వైయిట్ ఆపోజిట్. పూర్ శేఖర్! సచేనైస్ జంటిల్‌మాన్" రెడ్డిగొంతులో శేఖర్‌పై సానుభూతి.

"నరేంద్ర క్రమంగా సుష్మ ఆకర్షణలో పడిపోతున్నాడు."

"వనిత తనంతట తావలచి వస్తే మడిగట్టుకునే మగధీరు డెవడు?" రాయ్ అన్నాడు.

రెడ్డికి సుష్మ తనను కవ్వించడానికి ప్రయత్నించిన రాత్రి గుర్తుకొచ్చింది. ఆమెను మృదువుగా తప్పించుకోవడానికి యెంత ప్రయాసపడాల్సి వచ్చింది.

తన భార్య ఇతరులతో గడిపితే యెలా తను సహించలేడో ఆమే అంతే కదా! ఇది రెడ్డి సిద్ధాంతం.

"ఇందాక వందన శేఖర్ డాన్స్ చేస్తూంటే చూశాను."

"దే మేక్ ఎ వండ్రఫుల్ పేర్" వర్మ గొంతులో ప్రశంస.

"ఐ విష్ దె వర్ మాన్ యెండ్ వైఫ్" రెడ్డి గొంతులో సిన్సియర్ విష్.

"యస్. యస్" రాయ్ వంత పాడాడు మనస్ఫూర్తిగా.

అంతవరకు వాళ్ళ వెనగ్గా డాన్సు చేస్తున్న శేఖర్ వందనలు ఉలిక్కిపడి తలెత్తారు ఈ మాటలకు. వారి చూపులు ఓ క్షణం కలసి విడిపోయాయి. ఎంత చులకనగా మాట్లాడారు సుష్మ గురించి.

"శేఖర్! సుష్మ గురించి వాళ్ళ 'గాసిప్' విన్నారా?"

"అది 'మియర్ గాసిప్' కాదు" గంభీరంగా అన్నాడు శేఖర్.

షాక్ తిన్నట్లయింది వందనకు.

"యూ మీన్...." ఆగింది పూర్తిచేయలేక.

డాన్సు ఆపి ఖాళీగా వున్న టేబిల్ దగ్గరికి తీసికెళ్ళి వందనను కూర్చోబెట్టి తనూ యెదురుగా కూర్చున్నాడు.

"నిజాన్ని అబద్ధమని యెంతకాలం మనసుని నమ్మించగలం?" యెటో చూస్తూ అన్నాడు.

"ఆ రోజు విన్నావుగా జీవితంగురించి సుష్మ అభిప్రాయం. నమ్మింది ఆచరిస్తుంది."

వందనకు గుర్తు వచ్చింది.

సుష్మా పుట్టినరోజు సందర్భంగా ఓ పదిమంది ముఖ్యస్నేహితుల నాహ్వానించింది. వారిలో నరేంద్ర దంపతులుకూడా వున్నారు.

మాటల సందర్భంలో అన్నది.

"జీవితం యెంతో మధురమైనది. లైఫ్ యీజ్ ఎ లవ్లీ థింగ్ టు యెంజాయ్. ఉయ్ మస్ట్ ఎలిసిట్ యాజ్ మచ్ ప్లెజర్ యాజ్ పాసిబిల్. అదే నా సిద్ధాంతం. అనుభవించే అవకాశం, అర్హత ఉన్నప్పుడు జారవిడచుకోవడం కంటే వేరే తెలివితక్కువతనం ఏముంది? మనసు పడింది అనుభవించడం నా సరదా!

ఓరచయిత ఏమన్నాడో తెలుసా! జీవితంలో రెండే లక్ష్యాలు. ఒకటి కోరుకున్నది పొందడం. రెండోది పొందినదాన్ని మనసారా అనుభవించడం.

వెరైటీ లేకపోతే జీవితంలో మధురిమ ఏది?" తన అభిప్రాయాన్ని ఖచ్చితంగా మాటల్లో చెప్పేసింది.

"ఎన్ని కలలు కన్నాను వైవాహిక జీవితం గురించి? భార్య గురించి ఏమేమో ఊహించాను...." శేఖర్ భారంగా కండ్లుమూసుకుని గొణుక్కుంటున్నాడు.

"శేఖర్" వందన హృదయం ఆర్ద్రితతో నిండింది.

పూర్ శేఖర్! ఇంత వ్యధ, వేదన మనసులో పెట్టుకు పైకి నవ్వుతూ మామూలుగా మసిలేందుకు యెంత శక్తి కూ గట్టుకోవాలి!

* * *

బెడ్ రూంలోకి అడుగుపెట్టిన వందన యెదురుగా దృశ్యం చూసి కనుబొమలు ముడిపడ్డాయి చిరాకుతో.

నరేంద్ర సీసాలు ఖాళీ చేస్తున్నాడు.

హుం. యెంత వారించినా వినడు.

ఎంతో మంచివాడుగా ప్రేమగా వున్న నరేంద్ర యె పోయాడు. క్రమంగా అన్నీ అలవాటు చేసుకుంటున్నాడు.

అప్పటికీ యెంతో చెప్పిచూసింది. ప్రాధేయపడింది

తాగుడు తప్పని నే చెప్పను. ఏదైనా అలవాటు వున్నంతమాత్రాన పరవాలేదు! కాని అదే వ్యసనంగా మారితే ప్రమాదాలకు దారి తీస్తుంది.

ముందు ముందు ఓ 'పెగ్'తో తృప్తిపడేవారు. నేనూ పట్టించుకోలేదు. అప్పుడప్పుడు మోతాదుకి మించి త్రాగేవారు. అదీ సహించాను. కాని యిప్పుడు ప్రతిరోజూ తప్పనిసరిగాఉండాలి మీకు. ఆ వ్యసనానికి బానిసై పోయారు. సృష్టినే క్రమంగా అదుపులోనికి తెచ్చుకుంటున్న మానవుడు కేవలం వ్యసనాలకు దాసుడై జీవితాన్ని అంధకారబంధురం చేసుకోవడం యెంత హాస్యాస్పదం.

త్రాగుడు కలవాటుపడిన మీ మొహం యెప్పుడైనా పరీక్షగా చూసుకున్నారా అద్దంలో? ఓసారి చూసుకోండి తెలుస్తుంది."

ఆరోగ్యాన్ని హరింపజేసే యీ త్రాగుడు మానేయమంది. అది మన మధ్య వున్న సున్నితమైన బంధాన్ని తెంపేవరకు తీసుకు పోవద్దంది.

ప్రేమగా లాలిస్తూ చెప్పినప్పుడు వింటున్నట్లు నటిస్తాడు. ఇంక త్రాగనని వందనను ప్రసన్నం చేసుకుంటాడు. విసిగిపోయింది వందన.

ఆ మధ్య నరేంద్రకు బయట తిరుగుళ్ళు యెక్కువైనాయి. ఆఫీసు స్టెనోతో, ఇంకెవరితోనో తిరుగుతున్నట్లు వింది.

అమెరికా అమ్మాయిలతో 'డేటింగ్' ప్రమాదకరం కాదు. ళ్ళకది మామూలు కదా అని ఊరుకుంది. కాని సుష్మాతో సంబంధం ట్టుకొని శేఖర్‌ను బాధిస్తున్నాడు.

తన కళ్ళ ఎదురుగా సీసాలు ఖాళీ చేస్తూంటే యిక ఊరుకో యింది.

నరేంద్ర దగ్గరకు వెళ్ళింది. నాల్గో సీసామూత తెరవబోతున్న యి పట్టి ఆపింది.

"ప్లీజ్ ఎనఫ్ డార్లింగ్."

రాగ్గా చూశాడు నరేంద్ర.

క్కుమంది మనసు.

వెనక్కి తిరిగిపోదామనుకుంది. సహనం కూడుగట్టుకుంది. భర్తను సరిదిద్దాల్సిన బాధ్యత తనకుంది. తన ప్రయత్నలోపం ఉండకూడదు. మనసు గట్టిపరచుకొంది.

"నరేన్! మనిద్దరం హాయిగా మనసువిప్పి మాట్లాడుకుని యెన్ని రోజులైందో తెలుసా" అతని ప్రక్కగా కూర్చుంటూ అంది.

"ఏం తోచడం లేదు."

"ఏం తోచకపోతే ఉన్నాడుగా నీ ఫ్రెండ్ శేఖర్. వెళ్ళతని దగ్గరకు" గ్లాసు నింపుతూ అన్నాడు.

తన అహం దెబ్బతింది.

తనను పట్టించుకోకుండా జల్సాగా తిరిగే నరేంద్రకు తనపై అనుమానమా!

"ఓహ్! కోపమే యిదంతా?" మనసులో బాధ ప్రక్కకు నెట్టి నవ్వేస్తూ అంది వందన.

"కమాన్ డార్లింగ్. నిద్రొస్తోంది నాకు" అతని మెడచుట్టూ చేతులు పెనవేస్తూ అంది గోముగా.

"ఏం! ఈ రోజు ప్రేమ ముంచుకొస్తోంది? చిత్తుగా త్రాగే నన్ను భరించలేనన్నావుగా? నేను ప్రాధేయపడినపుడు విదిల్చి కొట్టేదానివిగా?"

"నరేన్ మత్తు...." ఏదో చెప్పబోయింది వందన.

"నువ్వేం చెప్పొద్దు. మత్తు అవరించలేదింకా. నీకంటే సుష్మానయం. భార్యగా నువ్వు యివ్వడానికి యిష్టపడని సుఖాన్ని నవ్వుతూ యిస్తుంది."

చెళ్ళున కొరడాతో కొట్టినట్లయింది వందనకు.

తనకు సుష్మాతో పోలికా?

భార్యకంటే, అందరితోను తిరిగే పరాయివాడి భార్య అనే యీ మగవాడు యెలాంటివాడు?

కవ్విస్తూ కళ్ళెదురుగా నిల్చున్న సుష్మా అతనిచేత లనిపిస్తోంది.

మత్తులో లేనని తనే చెప్తున్నాడు.

అంటే హి రియల్లీ మెన్ట్ వాట్ హి సెడ్.

అంతవరకు వందన మనసులో భర్త అనివున్న ఆ కాస్త గౌరవం కూడా పోయింది.

అతని ప్రవర్తన వందన అహం మీద దెబ్బతీసింది.

అతని మాటలు మనసును గాయపరిచాయి.

అంటే తన అవసరం యింకతనికి లేదనేగా!

భారంగా వేదనగా కదిలివెళ్ళింది వందన.

గాడ్! ఈ అమెరికా రాకుండా వుండివుంటే ఎంత బాగుండేది. జీవితం యింకోలా వుండేది కదూ!

* * *

ప్రొద్దున బ్రేక్‌ఫాస్ట్ టేబిల్‌మీద అమరుస్తున్న వందన చేయి పట్టుకుని ఆపాడు నరేంద్ర.

"వందనా...." ఏదో చెప్పబోయాడు. కాని పూర్తిచేయకుండానే ఆగిపోయాడు.

వందన కళ్ళల్లో యెంత నిరసన! అసహ్యం! చేయి విసురుగా లాక్కుని వెళ్ళిపోయింది వందన.

హుం ఇదో ఫార్సు అయిపోయింది. తప్పుడు పనులు ...డం 'సారీ' చెప్పడం.

రాత్రి అతడన్న మాటలు జన్మలో మర్చిపోలగదా!

"ఎంత అహకారం! యెంత విసురుగా వెళ్ళింది. ఆడదైన అంత వుంటే ..." నరేంద్రలో మగవాడనే అహంకారం విజృంభించింది.

...యట తిరుగుతున్నప్పుడు మామూలుగా వుంటారు. కాని ...యెవరి పట్టుదలలు వారివే. నరేంద్ర సరదాలు బయట ...న్నాడు.

...న మనసు విరిగిపోయింది.

... నరేంద్ర తన తప్పిదాన్ని తెలుసుకుని నిజమైన ... తన దగ్గరకు పూర్వపు నరేంద్రగా వస్తే ఆదరించ

ఏమో!

ఇండియా తిరిగి వెళ్ళిపోవాలనివుంది వందనకు.

రెండురోజులుగా నరేంద్ర కొత్తధోరణి అవలంబిస్తున్నాడు.

ఆ రోజు సాయంకాలం పార్టీవుంది.

ఇంటిలో పట్టుదలగా, ముభావంగా వున్నా బయట కలిసే తిరుగుతున్నారు.

అందుకని తనకోసం వెయిట్ చేస్తాడేమోనని ముందే చెప్పేసింది వందన ఆ రోజు పార్టీకి తాను రావడంలేదని. అది విన్న నరేంద్ర మొహం చిట్లించాడు.

"హుఁ నేను కేవలం ఓ డ్రైవర్ అయిపోయాను. ఇష్టపడితే తీసికెళ్ళడానికి, లేకపోతే మానేయడానికి. నన్ను కేవలం ఎస్కార్ట్‌గా ఉపయోగిస్తోంది" గొణుక్కుంటున్న నరేంద్రను తెల్లబోయి చూసింది.

సాయంకాలం వచ్చాడు హడావిడిగా.

"ఉఁ తొందరగా బయలుదేరు. పార్టీవుందని తెలియదూ?"

విసుక్కుంటున్న నరేంద్రను చూసి తాపీగా జవాబిచ్చింది.

"నేను రావడంలేదని ప్రొద్దునే చెప్పాను."

"ఏం ఏమయింది నీకు? బాగానే వున్నావుగా?" అది

నవ్వుతూ అడిగాడు.

"మనిషి బాగానేవున్నాను."

"ఓహో మనసు బాగోలేదన్నమాట" వ్యంగ్యంగా అ

"చాల్లే. బయలుదేరు. నువ్వు రాకపోతే అడి

పంజాయిషీ యెవడిచ్చుకుంటాడు?"

"ప్లీజ్ నరేన్. లీవ్ మి ఎలోన్. నాకు తలనొప్పి

రాలేను."

"ఏం ఇప్పుడు బాగానే వున్నావుగా. నీ యి

ఆడించడానికి నేనేం బొమ్మను కాను? అయినా శేఖర్

యింట్ అవుతాడు."

"నరేన్" కోపంగా బాధగా వుంది వందన గొ

"వందనా! ఇదుగో! నన్ను అవమానించాలని చూడకు. నేనే నిన్ను తీసుకురాలేదనుకుంటారు."

ఇక అతనిచేత వాదించడం యిష్టంలేక బయలుదేరింది వందన.

- వందన రాదని, తనని తిట్టుతుందనుకున్నాడు. కాని అతని ఆలోచనలు తలక్రిందులు చేసింది.

రెడీ అవడానికి వందన తీసుకున్న ఐదు నిమిషాలు యెంత సేపని గొణుక్కుంటూనే వున్నాడు నరేంద్ర.

తనని తిరిగి మాటలంటుందని యెదురుచూశాడు. కాని వందన మౌనం అతన్ని రెచ్చగొడుతోంది.

పార్టీలో అందరితోను తనకు తలనొప్పిగా వుందని, వందన బలవంతంమీద వచ్చానని చెప్పాడు. ముభావంగా వుండి అందరి సానుభూతి పొందాడు.

"నిజమేనా" ఎవరో అడిగారు వందనను.

ఓ సారి నరేన్‌వంక చూసింది వందన. అతని కళ్ళల్లో గర్వరేఖ.

తనని అవమానించాలని ప్రయత్నిస్తున్నాడు. వెళ్ళిపోదామని న్న వందన మాటలు విన్పించుకోకుండా కావాలని తాత్సారం శాడు.

ఇంకోసారి

అందరూ 'పిక్‌నిక్'లాంటిది వేసుకోవాలనుకున్నారు. ఆ తి తెలిసి నరేన్‌ను అడిగింది వందన 'వెళదామా' అని

"నేను రావడంలేదు. కావాలంటే నువ్వెళ్ళు."

"మీరు వస్తున్నారు కదూ?" జయశ్రీరెడ్డి అడిగింది.

"లేదు. మేం రావడంలేదు. సారీ."

అదేం?" మిసెస్ వర్మ, మిసెస్ గుప్తా ఒకేసారి అడిగారు.

చెప్పుతోంది వందన.

రేన్‌కు ఒంట్లో బాగుండలేదట. రానన్నారు."

బద్ధం" చిప్పున్న వెనక్కు తిరిగింది వందన నరేన్

"నా కిష్టంలేదు వెళ్ళొద్దు అని నాతో చెప్పి, వీళ్ళతో నాకు ఒంట్లో బాగుండలేదని చెప్తావా?"

"నరేన్" వందన వారింపుగా అంది.

అప్పటికే అందరూ తనను గుచ్చి గుచ్చి చూస్తున్నట్లనిపిస్తే ఇక మాట్లాడక ఊరుకుంది.

"ఈ మధ్య వందన వరస బాగాలేదులెండి. నన్ను పూర్తిగా తన కంట్రోల్‌లో వుంచుకోవాలనుకుంటోంది. పిక్‌నిక్ నేను మిస్ అవుతానా? నాకెంత సరదానో మీకు తెలుసుగా?"

అందరిలోను తనను అవమానించడమే ధ్యేయంగా పెట్టుకు న్నట్లు యెంత నిర్దాక్షిణ్యంగా, అసహ్యంగా ప్రవర్తిస్తున్నాడు.

వందన మొహం అవమానంతో యెర్రబడింది.

మనస్సు అంపపు కోతకు గురి అయ్యింది.

ఇలా కావాలని చేస్తున్నాడని తనకు తెలుసు.

కాని చూచేవాళ్ళకు యెంత వినోదం!

అయినా మనసులో బాధను బలవంతాన అణిచినట్లుగా ముని పంటితో క్రింది పెదవిని నొక్కిపెట్టింది. మొహంలో ఏమాత్రం బాధ తెలియనివ్వకుండా సాధ్యమైనంత సౌమ్యంగా వుంది.

అదే....ఆ ఓర్పుకునే శక్తి, బయట తేలని మనస్తత్వ ఆ మౌనం నరేన్‌కు గుండెకోతగా వుంది. సరదాగా, చిలిపిగా వు వందన యిలా నిశ్శబ్దంగా, ముభావంగా వుండటం భరింపలేని వుంది నరేన్‌కు. ఎందుకు తిరిగి తనను మాటలనదు?

పోనీ తాను 'సారీ' చెప్పినతర్వాత అయినా మన్నించి మామూలుగా ఉందా అంటే అదీలేదు.

ఓ మాటాలేదు. పలుకులేదు.

ఎంతో సౌమ్యంగా కన్పిస్తూనే కఠినంగా ప్ర సంయమన శక్తి అంటే యిదేనా?

ఏమో!

అదోరకం అహంకారంగా, గర్వంగా అన్పించి ఇంత అవమానించినా, పన్నెత్తి ఒకమాట అనని వం

ఓర్చుకున్నట్లుగా వున్న వందన అతన్ని మరింత కవ్వించి, తనకు తెలియకుండానే నరేన్‌లో కసిని యెక్కువచేస్తోంది.

*　　*　　*

"సుష్మా ప్లీజ్ ఫర్ గాడ్స్ సేక్. నీ పద్ధతి మార్చుకో. లెటజ్ స్టార్ట్ లైఫ్ యెఫ్రెష్."

సుష్మా ప్రవర్తనతో విసిగి వేసారిపోయిన శేఖర్ ఆఖరి ప్రయత్నంగా నచ్చచెప్పబోయాడు.

"ఎందుకు? లైఫ్ యెంజాయ్ చేయడం చేతకాని నీలాంటి దద్దమ్మలతో మళ్ళీ మొదలేమిటి?"

"సుష్మా" వారింపుగా అన్నాడు శేఖర్.

"ఎందుకు అరవడం? నామీద పడి ఏడవలేకపోతే ఎంచక్కా లైఫ్ యెంజాయ్ చేయడం నేర్చుకోరాదూ?"

"లైఫ్‌ను ఎంజాయ్ చేయడమంటే యింకోరి జీవితంతో ఆడుకోవడం కాదు?"

"నే నెవరి జీవితంతోను ఆడుకోవడంలేదు. దీపం చుట్టూ పురుగులు చేరడం సహజం! పురుగులు కాలిపోతే అది దీపం తప్పు కాదు. బాధ్యత అంతకన్నా దీపానిది కాదు" నిర్లక్ష్యంగా అంది.

"దీపం పురుగుల్ని ఆకర్షించడమే కాదు. వెలుగుకూడా నిస్తుందని, ఆరిపోతున్న దీపాలు వెలిగించడానికి ఉపయోగపడ్తుందని, అదే జీవితాలకు సమన్వయించుకోవాలని యెలా చెప్పాలి ఈ మనిషికి." నిట్టూర్చాడు శేఖర్.

"ఓ చిన్న రిక్వెస్ట్! ఫర్ గాడ్స్ సేక్ లీవ్ నరేంద్ర ఎలోన్ ప్లీజ్" వేడికోలుగా అన్నాడు.

"ఏమిటో ఆ ఇంట్రెస్టు" వ్యంగ్యంగా అంది.

"ఏమిటా? నీమూలంగా వందన జీవితం పాడవుతోంది."

"ఓహో అదా తమరి బాధ! అయినా ఏమిటో వందన అంటే ఇంటరెస్టు?"

"సుష్మా" కోపంగా అరిచాడు.

సుష్మాకు గిల్టీగా వుంది. శేఖరేమో యెంజాయ్ చేయడు.

కాని తన సరదాలు తాను తీర్చుకుంటే క్లబ్‌లో 'గాసిప్'చేస్తున్నారు.

శేఖర్‌తో యీ నిస్సారమైన జీవితం గడపడం కష్టంగానే వుంది.

"అన్నట్లు నరేంద్ర వందనకు దూరమైతే తమరికి లైన్ క్లియర్ కదూ" తనతో సరదాగా మాట్లాడని శేఖర్ వందనతో యెంతో సరదాగా మాట్లాడటం చూసి జెలసీ.

సుష్మ చెంప ఛెళ్లుమంది. కోపంతో ఊగిపోయాడు శేఖర్.

"నువ్వసలు ఆడదానివేనా?"

"యూ....యూస్కౌండ్రల్! నామీద చెయ్యిచేసుకుంటావా?" చెంప పట్టుకుని నిల్చుండిపోయింది.

"షటప్" అసహ్యంగా చూశాడు.

"నువ్వు నువ్వు.... నీతో మాటలేమిటి? నీకు నాకు రాం రాం యీ క్షణంనుంచి. ఇంతజరిగాక మనం కలిసివుండటం అసంభవం."

"సుష్మ...." ఏదో చెప్పబోయాడు.

"షటప్. నా నిర్ణయం మారదు. లెట్స్ బీ డైవర్డ్స్"

* * *

డాక్టర్ ఫిలిప్స్ ఎంగేజ్‌మెంటు సందర్భంగా పార్టీ ఇస్తున్నాడు. అతడు చాలా ధనవంతుడు. డబ్బు కొనగల సదుపాయాలన్నీ అతడింట్లో చూడవచ్చని చెప్పుకుంటారు.

అందమైన పెద్ద భవనం. భవనం చుట్టూరా చక్కటి తోట. తోట మధ్యలో స్విమ్మింగ్‌పూల్ కొత్తగా కట్టించాడు. తోటమధ్యలో అందమైన పాలరాతి విగ్రహాల్ని చూడవచ్చు.

హాలంతా కోలాహలంగా వుంది. ఫిలిప్స్ కాబోయే శ అందంగా వుంది. యెవరితోనో డాన్సు చేస్తూంది.

కొలీగ్స్ కనుక శేఖర్, వందనలతోపాటు నరేంద్ర, లను కూడా ఆహ్వానించాడు.

సుష్మ, నరేంద్రలు తోటలోకి జారుకోవడం శేఖర్ గమనించారు.

ఫిలిప్స్ అతిథులను తప్పించుకొని వచ్చాడు వందన

"మేడం! మీరు స్విమ్మింగ్‌పూల్ చూడలేదు కదూ! రండి చూపిస్తాను" చనువుగా చేయిపట్టుకుని తీసికెళ్లాడు.

నిండు పున్నమి. పండు వెన్నెల వెలుగులో తోటంతా రక రకాల పూ పొదరిల్లుతో మనోజ్ఞంగా వుంది. ప్రేమికుల మనసులు రంజింపచేసేలా వుంది అక్కడి రమణీయకత.

పాలరాతి బొమ్మలు వింతగా మెరుస్తున్నాయి.

ఒక్కొక్కటే చూపిస్తున్నాడు ఫిలిప్స్.

ఎంత ఖరీదు పెట్టి యెలా సేకరించాడో చెప్తున్నాడు.

వింటూ తోటంతా కలియజూస్తోంది వందన. నిజంగా నందన వనంలా వుంది అనుకుంది.

హఠాత్తుగా ఫిలిప్స్ చేతులు వందన చుట్టూ వేసి ముందుకు వంగబోయాడు.

ఓ క్షణం నిరుత్తరాలైన వందన వెంటనే తేరుకుంది.

"మిస్టర్ పిలిప్స్ వాటీజ్ దిస్?" చేతులు విదిలిస్తూ అంది కోపంగా.

"ఓ డార్లింగ్! యూ డ్రైవ్ మి క్రేజీ విత్ యువర్‌బ్యూటీ" చేతులు మరింతగా బిగించాడు.

"యూ క్రేజీ క్రీచర్! యూ...." బలమంతా ఉపయోగించి విడిపించుకోవాలని ప్రయత్నించింది.

"దట్స్ రైట్.... అయాం క్రేజీ అబౌట్ యూ. కమాన్ సీ...."

చెంపను తాకబోయిన చేతిని మధ్యలోనే అందుకొని ముద్దు ...ని

"డోంట్ బీ సిల్లీ ...." మొహంమీదకు వంగబోయాడు.

...టుక్కున మొహం తిప్పుకుంది. "ప్లీజ్ లీవ్ మీ."

...నో. అయ్‌కాన్ట్. అయ్‌హేడ్ సుష్మా,నౌ అయ్‌వాంట్ యూ. ...డ్ ఆఫ్టర్ యూ...." వంగిన పిలిప్స్ పెదవులకు వందన ...పె.

...యూ....యూ....లెట్‌మిగో ప్లీజ్....లెట్‌మిగో" కళ్ళ ...నం

నీళ్ళ పర్యంతం అవుతోంది వందనకు.

"నో....నో. అయ్‌మస్ట్ హావ్ యూ....యూ ఆర్ మై స్వీట్ హార్ట్" వందన మొహం రెండు చేతుల్లోకి తీసుకుని వంగ బోతున్నాడు.

"మిస్టర్ ఫిలిప్స్"గంభీరంగా శేఖర్ గొంతు కొంచెం దూరం నుంచి విన్పించింది.

అంతే ఫిలిప్స్ పట్టు సడలింది.

"సారీ" గొణుక్కుంటూ వందనను వదిలి వెళ్ళిపోయాడు ఫిలిప్స్.

"వందనా" కళ్ళనిండా నీరు నింపుకుని, వణికిపోతూ నిల్చున్న వందన భుజంమీద చేయివేశాడు. చేతులతో మొహం కప్పుకుంది.

"ప్లీజ్ వందనా" ఓదార్పుగా పలుకుతూ తన గుండెల్లోకి తీసుకున్నాడు శేఖర్.

అతని గుండెల్లో మొహం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. కొన్ని రోజులుగా గుండెల్లో కరడుగట్టిన బాధ, నరేంద్ర నిర్లక్ష్య వైఖరి తాలుకు వేదన కరిగి కన్నీళ్ళ రూపంలో వస్తూంది.

ఆ వేదనతో మరగిపోతున్న హృదయంలో పన్నీటి జల్లు శేఖర్‌తో పరిచయం.

జీవించాలనే యిచ్ఛ నశిస్తున్న తరుణంలో జీవితంమీద ఆ కల్గిస్తున్న శేఖర్ చల్లటి స్నేహ ఆధారం ఎక్కడ చేజారి పోతుం నన్నట్లు భయంగా అతన్ని హత్తుకుపోయింది.

భార్యచేత నిర్లక్ష్యం చేయబడిన భర్త ఒకరు.

భర్తచేత నిర్లక్ష్యం చేయబడిన భార్య ఒకరు.

ఇద్దరి మనసులో మూగగా మిగిలినబాధ, వేదన గుండెల్లో రగిలే బాధ మనసుకు నచ్చిన వ్యక్తి స్పర్శత సమక్షంలో మూగగా మాట్లాడుతూ హృదయం తేలి కొంటూంది.

చల్లటి పిల్లగాలి తగిలిన మేఘంలా కురుస్తోంది

శేఖర్ కోటంతా తడిచిపోతోంది.

అయినా వారించక కరువుదీరా ఏడ్వనిచ్చాడు.

రక్షిస్తున్నట్లుగా వందన చుట్టూరా చేయివేసి, ఓదార్పుగ వందన తల నిమిరుతూ వుండిపోయాడు.

అలా ఎంతసేపు వుండిపోయారో తెలియదు.

"శహభాష్. వండ్రఫుల్."

ఉలిక్కిపడి దూరంగా జరిగి చూశారు.

సుష్మ వ్యంగ్యంగా నవ్వుతూంది.

"చెప్పేవి శ్రీరంగ నీతులు, దూరేవి దొమ్మరి గుడిసెలు" అసహ్యంగా చూసింది వీరిద్దరి వంక.

"సుష్మా. అనవసరంగా మాటలు మీరకు. ఏవేవో ఊహించి మనసుల్ని గాయపరచకు" శేఖర్ గొంతులో హెచ్చరిక.

"ఆహా! ఏంతెలివి. ఎదురుగా లేనివాట్ని గురించి ఊహిస్తారు. కంటి కెదురుగా కన్పిస్తున్న దృశ్యానికి ఊహలెందుకు, సాక్ష్యాలెందుకు" నరేంద్ర గొంతు సుష్మ వెనకనుంచి కరుగ్గా విన్పించింది.

"నీ యీ చర్యకు సంజాయిషీ ఏమిటి?" నిలదీస్తున్నట్లుగా వందన ముందు నిలబడి అడిగాడు నరేంద్ర.

దుఃఖంనుంచి తేరుకున్న వందనకు యీ రభస మళ్ళీ కన్నీరు తెప్పించింది.

గమనించాడు శేఖర్. వందన భుజం చుట్టూరా చేయివేశాడు.

"నరేంద్ర...." ఏదో చెప్పబోయాడు శేఖర్..

"షటప్. నేనడుగుతున్నది నా భార్యను" భార్య పదంనొక్కి-స్తూ అన్నాడు నరేంద్ర.

ఓక్షణం వివర్ణమయింది శేఖర్ మొహం.

'ఫెయింట్' అయి తనవైపు వాలిపోతున్న వందనను రెండు పైకెత్తాడు.

'ఎవరికీ సంజాయిషీ యివ్వాల్సిన అవసరంలేదు" అంటూ పార్కు చేసిన వైపు వెళ్ళిపోయాడు శేఖర్.

చేష్టలుడిగి నిల్చుండిపోయాడు నరేంద్ర.

తేరుకుని చూసేసరికి కారు వెళ్లిపోయిన శబ్దం వినిపించింది.

* * *

ఏమిటి నరేన్ ధోరణి! ఎందుకిలా చిత్రహింస పెడుతున్నాడు!

శారీరకంగా పెడితే భరించవచ్చు. శారీరక గాయాలను మందు పూసి నయంచేసుకోవచ్చు.

కాని యీ విపరీత ధోరణి ఏమిటి?

మానసికంగా చిత్రవధ చేస్తున్నాడు.

అమానుష ప్రవర్తనతో మనస్సును తూట్లు పొడుస్తున్నాడు.

ఛీ. ఛీ....ఏమిటీ బ్రతుకు?

ఎవరికోసం యీ జీవనం?

తెలిసి తనేం తప్పుచేసింది?

చేయని నేరానికి శిక్ష అనుభవించాలా?

తను అంతగా కలలుగన్న జీవితం, ఫారిన్‌లో మరింతగా తన విజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవాలనే తనవాంఛ యిలా శాపంగా పరిణమించిందా!

ఇలా అని తెలిస్తే రాకుండా వుండేది!

వస్తేమాత్రం నరేన్ యింతగా దిగజారిపోవాలా?

ఈ మగవాళ్ళు ఎంత చిత్రంగా వుంటారు?

ఎంత కఠినంగా గుండెలు చీల్చగలరు?

అనుబంధాలు, మమతానురాగాలు ఎంత త్వరగా తెంకుంటారు!

నరేన్‌కు అక్కర్లేని నేను అతనికోసం ఎందుకు లాడాలి? ఎందుకు దేవిరించాలి?

నాకూ మానాభిమానాలు వున్నాయి.

చదువు నేర్పించిన విజ్ఞానంవుంది.

స్వతంత్ర జీవనాన్ని, ఆర్థికస్తోమత కలిగించే వుంది.

ఇన్ని సంవత్సరాలుగా తను సంతరించుకున్న వ్యక్తిత్వ
వుంది.

అహంకారంతో, అధికారం చలాయించే వ్యక్తికి, అ
ఎవరైనాకాని, తలవంచేందుకు తన వ్యక్తిత్వం సిద్ధంగాలేదు
మనస్సెదురు తిరుగుతోంది.

"ఏమిటో ఆ పరధ్యానం....సారీ....పరవశత్వం"వ్యంగ్యంగ
నవ్వుతూ ఎదురుగా నిల్చున్నాడు నరేన్.

వందన మొహం త్రిప్పేసుకుంది నిరసనగా.

"శేఖర్‌ను తలచుకొని కాబోలు."

"ఇన్నిరోజులు నీదంతా అలకే అనుకున్నాను. నామీద
ప్రణయకోపం అనుకున్నాను. ఇప్పుడు తెలిసింది అసలుకారణం.
నువ్వు ప్రేమలో పడ్డావు."

వందన మొహం యిటు త్రిప్పలేదు. నోరు విప్పలేదు.
నరేన్ దగ్గరగా వచ్చి నించున్నాడు.

వందన తిరస్కారం, నిర్లక్ష్యం చూసినకొద్దీ అతనిలో
వివేకం పారిపోసాగింది.

"ఆ శేఖర్ నిన్ను ఆకర్షించాడు. తిరుగుళ్ళు వుందని నన్ను
అసహ్యించుకున్నావుగా! ఇప్పుడు నువ్వు చేసేదేమిటి? ఆ శేఖర్‌ను
చూసుకునే కదూ నీకింత ధీమా? మీ మధ్య ఏ సంబంధమూ లేకపోతే
నా యెదురుగా నా భార్యను అలా అందరూ చూస్తుండగా ఎత్తుకుని
వెళ్తాడా?"

లేచి నుంచుంది వందన విసురుగా.

వందన యింకా మౌనం విడవకపోవడంతో, ఆమెను
ంతగా బాధించాలనిపించింది.

ఆమె కంఠం వినకపోవడంతో పిచ్చెక్కినట్లుగా వుంది
ను.

"అయినా అతను నీ పాతప్రియుడే కదూ."

చివ్వన వెనక్కి తిరిగి నరేన్‌కు అభిముఖంగా నిల్చుంది

వందన కళ్ళు నిప్పులు కురుస్తున్నట్లుగా వున్నాయ్. మొహం
అసహ్యంతో కాస్త ముడుచుకున్నట్లుగా వుంది.

పెదవులు కోపంతో అదురుతున్నాయి.

"నువ్వు....నువ్వు మనిషివి కాదు. ఎన్నేసి మాటలంటు
న్నావు? యెంత దారుణంగా మాట్లాడుతున్నావు?"

"ఏం నేనన్నది అబద్ధమా?"

"షటప్. నువ్వు నిజంగా రాక్షసుడివే...." విసురుగా చేయి
యెత్తబోయి మానేసింది.

"ఆహాఁ....అయితే రాక్షసుడితో కాపురం చేయకు. అంత
యిష్టం లేకపోతే డైవర్స్ తీసుకో. ఎంచక్కా శేఖర్‌తో వుండచ్చు."

"నరేన్".

కోపం పట్టలేక చెయ్యెత్తిన వందనను ఒక్కతోపు తోసాడు.
తోపుకు ప్రక్కకు పడటంతో టేబుల్ అంచు తగిలింది నుదుటికి.

అది చూసి దగ్గరకు రాబోయాడు నరేన్.

మొహం త్రిప్పుకుంది వందన.

మనస్సు బలంగా ముందుకు లాగుతున్నా, వందనను
కాస్సేపలా ఒంటరిగా వదలడం మంచిదనిపించి కాళ్ళను బలవంతంగా
బయటకు నడిపించాడు.

"అయాం సారీ వందనా! నిన్ను తెలిసీ నొప్పిస్తున్నాను.
నువ్వెందుకలా మౌనంగా నన్ను నా యిష్టానికి వదిలేశావ్. ఎందుకు
నాలో కసి రేపుతావు" మనసులో అనుకున్నాడు.

వందనకు చచ్చిపోవాలన్పిస్తోంది.

నరేన్ మాటలు, చర్య వందన నుదిటి మీది గాయం కనా
యెక్కువగా బాధించాయి.

ఛీ....ఛీ....యెంత అసహ్యంగా చిత్రించాడు తనకు, శే-
మధ్య వున్న సంబంధాన్ని!

అనురాగపూరితమైన స్నేహబంధమే వుంది తమమధ్య
వరకు.

జీవితంలో ఓ రకంగా యిద్దరూ ఓడిపోయారు అన్ని

అందుబాటులో వుండే శాంతి, సుఖం అందకుండా కప్పిం చడం, కలుషితమైన తమ మనసులతో, మాటలతో తమను చిత్ర హింసకు గురిచేసే జీవిత భాగస్వాములు లభించడం—ఇవి తమిద్దరనూ దగ్గరకు చేర్చింది.

గాయపడిన మనసులు మాటలు అవసరం లేకుండానే ఓదార్పును అందిస్తోంది.

ఇంతవరకు తమ స్నేహం పవిత్రంగానే వుంది.

ఎంత నీచంగా మాట్లాడాడు సరేన్.

తన మూలంగా పాపం శేఖర్ యెంత యిబ్బందికి, అవహేళ నకు గురి అవుతున్నాడు.

ఈ బ్రతుకు బ్రతక్కపోతేనేం?

జీవితంలో బలహీనక్షణం అనేది యెప్పుడో ఒకసారి వస్తుంది.

ఆ సమయంలో ఆ బలహీనమైన క్షణమే బలంగా మారి జీవితం మీద దెబ్బతీసి జీవన గమనాన్ని మార్చేస్తుంది.

ఒక్కసారిగా విరక్తి లాంటిది కల్గింది వందనకు. నిద్ర మాత్రల సీసా అందుకుంది. మింగబోయింది. వెంటనే వివేకం మేల్కొంది. సీసా పెట్టేసింది.

నేనెందుకు చావాలి? ఏం నేరం చేసాను?—

బ్రతుకు తీపి నిలవేస్తోంది ఒక ప్రక్క.

ఇంత బ్రతుకు బ్రతికి ఆత్మహత్య చేసుకోవడమా? ఇదేనా వ్యక్తిత్వము?

కేవలం ఒక బలహీనక్షణానికి నిండు జీవితాన్ని బలిచేయాలా?

అంత బలహీనురాలా తను?

కాదు! కాకూడదు!

...నకాలేజీలో స్పెషలైజేషన్ చేసి, మానవసేవ చేయాలనే ...మా ఏమిటి?

...ర్‌గా తన కర్తవ్యం నిర్వర్తించాలనుకుంది.

...చి డాక్టర్‌గా పేరు తెచ్చుకోవాలనుకుంది. అలాంటి ...వేశానికి లోనుకావడమా?

...ం

అలాగని నరేంద్ర చర్యలను యెంతకని సహించడం? భర్తచేత త్యజింపబడిన భార్యగా తన తల్లిదండ్రులకెలా ముఖం చూపించగలదు?

ముఖ్యంగా అమ్మ.

భర్తే దైవంగా భావించి, ప్రేమతో ఆరాధించే అమ్మ యీ విషయం విని తట్టుకోగలదా?

తనదే పొరపాటు అంటుంది.

దేవుడిలాంటివాడిని భర్తగా పొందిన అమ్మకు, యెప్పుడూ మాటలతో, చేతలతో నొప్పించని భర్తవున్న అమ్మకెలా తెలుస్తుంది తన బాధ?

తననెలా అర్థం చేసుకుంటుంది?

అన్యోన్యమైన అందమైన జంటగా తోబుట్టువులు ఆనందించారు. ఫారిన్‌లో వున్నామని గొప్పగా చెప్పుకుంటున్నారు.

అలాంటిది వారినెలా యెదుర్కోవడం ఒంటరిగా.

అందుకనే....

ఛీ. మళ్ళీ అదే ఆలోచన.

హఠాత్తుగా శేఖర్ మాటలు గుర్తొచ్చాయి.

'వినగలిగే హృదయం వుండాలి గాని అంతా నాదమయం కొనగలిగే మనసుంటే ప్రకృతి అంతా అందం వెల్లివిరుస్తుం నిజం! యెప్పుడైనా, ప్రశాంత మనోజ్ఞకరమైన ప్రకృతిలో కూర్చు వున్నపుడు మనసు నిర్మలంగా శాంతిగా హాయిగా వున్నట్లనిపి బ్రతుకుమీద మనకు తెలీకుండానే మమకారం బలంగా ఏర్పడుతు

దూరంగా, సుదూరంగా ప్రకృతిలోంచి జీవనరాగం మధురంగా విన్పిస్తుంది. బ్రతుకు అనురాగమయంగా కన్పి

నిజంగానే వందన! ఇండియాలో వున్నపుడు, యె మనసు అశాంతితో వేగిపోయినపుడు దగ్గరలో వున్న ప వాణ్ణి. ఆ నిష్కల్మషమైన ప్రశాంత పల్లె వాతావరణంలో ఒంటరిగా వున్నప్పుడు నా కిలాంటి అనుభూతి కలిగేది.

ఒక్కొక్కసారి అనిపిస్తుంది మనసు ప్రశాం

పుడు ఓ కవి అన్నట్లు "ఆకులో ఆకునై-పూవులో పూవునై "పోవాలని. ఎంత చక్కటి భావన అది!

ప్రకృతిలో ఒక భావమై పోవాలనే ఆ తపన ఎంత హృద్యమైంది!

నిజంగా మనకీ మానవజన్మ యిచ్చినందుకు భగవంతుడికి మనం కృతాజ్ఞులమై వుండాలేమో!

అందాన్ని చూడగలిగే కనులు, జీవరాగం వినగలిగే చెవులు, వివిధ రకాల రుచిని చవిచూసే జిహ్వ రకరకాల వాసనలను, సువాసనలను ఆఘ్రాణించే ముక్కు, రకరకాల స్పర్శాజ్ఞానం—వీటన్నిటినీ ఆస్వాదించి ఆనందించేందుకు జీవితంలోని మధురమైన అనుభూతులకు ఆలవాలమైన మనస్సు. ఓహ్! వీటన్నిటిని పొందగలిగిన మనిషి యెంత అదృష్టవంతుడు.

మంచి, చెడు తెలియజెప్పే విచక్షణాజ్ఞానాన్నిచ్చే మెదడు కూడా అనుగ్రహించాడు భగవంతుడు. వీటి సహాయంతో మనిషి జీవితాన్ని సాధ్యమైనంత సుఖంగా, ఆనందంగా రూపొందించుకుని బ్రతుకును అనురాగమయం చేసుకోవాలి.

ప్రకృతిలోని అందాలన్నిటినీ చూసి, అనుభవించి ఆనందం పొందమని దేవుడు మనకిచ్చిన వరం యీ జీవితం.

ఈ జీవితాన్ని చేజేతులారా పాడుచేసుకోవడం కంటే వేరే దదృష్టం, నరకం లేదు.

వందనా! జీవితం జీవించడానికే అని నమ్మినపుడు జీవితం ఆశలు వాటంతట అవే కలుగుతాయి. ఆ ఆశ అనేదే జీవితానికి ౦న అవుతుంది! మనిషికి ఊపిరిపోస్తుంది!'

"ఆ ఆశే అడియాస అయితే?" మధ్యలో అడిగింది.

ఆశలు అడియాస అయితే కొత్త ఆశలను చివురింప జేసు ఆశలు లేని మనిషి జడపదార్థంతో సమానం. ఆశలు లేని పలు ఉండదేమో? ఆశలు, కోరికలు అనేవి లేకపోతే కే వుండదేమో!

ాలు తీసుకోవాలనుకోవడం తేలికే కాని దానిక్కూడ

తెగింపు అవసరం. అది అంత సులభంగా రాదనుకుంటాను.

ఎప్పటి కప్పుడు ఆశలు మనసులో తలెత్తుతూ వుంటాయి. వాటిని తీర్చుకోవాలనే తపనతో ఎప్పటికప్పుడు జీవితంలో ముందుకు సాగిపోతూవుంటాం. అది సహజం కూడాను.

ఈ జీవితం అనే ప్రయాణంలో యెన్నోరకాల మనుష్యులను కలుస్తూ వుంటాం. పుట్టినదగ్గర్నుంచి వాళ్ళతో రకరకాల అనుబంధాలు యేర్పడుతాయి. ఈ అనుబంధాలు మనల్ని కట్టిపడవేస్తాయి ఏదో రకంగా."

"ఒక వ్యక్తితో మనకున్న అనుబంధం తెగిపోతే, పవిత్రబంధంగా పెద్దలు భావించే ఆ అనుబంధానికి విలువే లేకపోతే?" వందన కళ్ళల్లో నీరు చిందుతూంది.

వందన మనసులోని వేదన, మూగబాధ అర్థం అయింది శేఖర్‌కు.

కేవలం భర్త తనను నిర్లక్ష్యం చేసాడన్న వ్యధతో జీవితం మీద యిచ్ఛను చంపుకుంటోంది వందన.

ఇది అమాయకత్వం అనుకోవాలా?

లేక అవివేక మనుకోవాలా?

తన మనసు నెలా చెప్పాలో తెలియడం లేదు శేఖర్‌క జీవితాన్ని ప్రేమించే శేఖర్ వందనకు ధైర్యం నూరిపోయా కున్నాడు.

"చూడు వందనా! అనుబంధాలు, ఆత్మీయతలు ఆ బూటకం అని, జగమంతా ఒక మాయ అని వింటాం. కాని మంది అవి మనసుకు పట్టించుకుంటున్నారు? ఈ ఇహలోకం బూటకం అని మనసావాచా నమ్మి, యీ అనుబంధాలను, ఆ రాగాలను పుటుక్కున మనం తెంపేసుకుంటే అందరూ పోరూ? అందరూ అలా సన్యాసులైపోతే యీ సృష్టి సాగేదెలాగా?

అనుబంధాలను తెంపుకోవడం అంత సులభంక ఒకరు నిర్లక్ష్యం చేసారని నిండుజీవితాన్ని బలిచేయడ

కేవలం ఆ ఒక వ్యక్తితోనే కాదుగా ముడిపడింది? లేక జీవితం అంతా అతనే కాదు. ప్రపంచంలో అతనొక్కడేకాదు వుండేది.

కాబట్టి జీవితం ఏ ఒక్కరికోసమూ కాదు. అతనితో అనుబంధం తెగిపోతే, ఇంకొకరితో ఏర్పడుతుంది. పాత నీరు పోయి క్రొత్త నీరు చేరినట్లే, ఒకరితర్వాత ఇంకొకరు ఈ జీవితంలో ప్రవేశిస్తూనే వుంటారు.

కాలం జీవితంలో చాలా మార్పులు తెస్తుంది. కాలం అనేది గాయాలను మాన్పగలదు, గాయం చేయనూ గలదు.

అదే కాలం సమస్యలను సృష్టించగలదు. వాటికి పరిష్కారం చూపగలదు.

ఈ జీవనగతి అతివేగంగా నడుస్తుంది. ఆ వేగంలో మనకు తెలిసి కొన్ని, తెలియక కొన్ని మార్పులు వస్తూంటాయి.

ఒక్కోసారి మన జీవితమనే నాటకానికి మనమే ప్రేక్షకుల్లా మిగిలిపోతూ వుంటాం.

ఓ(. ఏమేమో మాట్లాడేస్తున్నాను కదూ" వందన చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు శేఖర్ స్నేహంగా.

వందన కళ్ళు విప్పార్చుకొని అలాగే చూస్తూంది శేఖర్ని.

ఎందుకు తనంటే శేఖర్కు ఇంత తాపత్రయం?

శేఖర్ వందన కళ్ళల్లోని ఆ భావాన్ని గ్రహించినవాడిలా ...దన చేయి ఆప్యాయంగా నొక్కుతూ, మందంగా నవ్వుతూ లేచి ... తన కిష్టమైన పాటవున్న కాసెట్ తీపి, టేప్ ఆన్ చేసాడు.

"మనసున మనసై
బ్రతుకున బ్రతుకై
తోడొక రుండిన
అదే భాగ్యము
అదే స్వర్గము."

...! ఎన్ని రోజులకు తన కిష్టమైన పాట వింటోంది.
... భావాన్ని తాను అనుభూతి పొందుతున్నట్లుగా అలాంటి ...కుతున్నట్లుగా కంఠంలో ఆ భావాన్ని కురిపిస్తున్న

...ం

ఆ మృదుమధుర గంభీరస్వరం వింటూండిపోయారు ఇద్దరూ.

శేఖర్ తాను అమెరికా వచ్చేముందు తన అభిమాన గాయకుడైన ఘంటసాలగారు పాడిన, తను అమితంగా యిష్టపడే పాటలను రికార్డు చేసుకుని వచ్చాడు.

ఆ పాటంటే మరీను. రోజు కొక్కసారన్నా వింటాడు.

పాట అయిపోగానే టేప్ ఆఫ్‌చేశాడు శేఖర్.

"ఇప్పుడు చెప్పు వందనా! నిజంగా నీకిప్పుడు బ్రతకాలని లేదూ?"

శేఖర్ కళ్ళల్లోని అనురాగం నిజంగానే బ్రతకాలనే ఆశ కలిగిస్తోంది.

'నీ తీయటి స్నేహంకోసం, నిర్మలమైన స్నేహంకోసం బ్రతికి తీరుతాను' మనసులో అనుకుంది వందన.

"చెప్పు వందనా?"

ఉందన్నట్లుగా తల ఆడించింది.

మాటలు రానట్లుగా తల ఆడించినా, మనసులోని మాటను కళ్ళల్లోని మెరుపులు చెప్తున్నాయి.

తమిద్దరి మధ్య జరిగిన సంభాషణ గుర్తుకు వచ్చిన వంద దృఢనిశ్చయాని కొచ్చినట్లుగా ఒక్కసారి గట్టిగా కళ్ళు మూసుకొం

ఓ క్షణం తర్వాత కళ్ళు తెరిచింది.

ఈ జీవితం నరేన్ కోసం కాదుగా?

నా కోసమే నేను జీవిస్తాను.

నుదుటిమీంచి బుగ్గలమీదికి ఏదో కారుతున్నట్ల తడుముకుంది.

రక్తం!!

అవును! నరేన్ విసురుగా త్రోయడంతో గాయమ

మళ్ళీ నరేన్ చర్య, మాటలు గుర్తుకు వచ్చాయి

* *

"అరె నుదుటను ఆ ప్లాస్టర్ ఏమిటి?" శేఖ అడిగాడు.

ఒకక్షణం ఏం మాట్లాడలేదు వందన.

"నాతో చెప్పవూ" వందన చేతిని ఆప్యాయంగా తన చేతిలోకి తీసుకుంటూ అడిగాడు.

ఆ స్పర్శలోని ఆప్యాయతకు, ఆ కంఠంలోని ఆర్ద్రతకు కరిగిపోయింది వందన.

"మాటలతో మనసును తూట్లు పొడుస్తున్నాడు నరేన్. విసురుగా తోయడంతో టేబుల్ అంచు తగిలి గాయమయింది. పర్వాలేదు మానిపోతుంది. కాని.... కాని...."

తన చేతిలోని వందన చేతిని మృదువుగా నొక్కాడు.

"విడాకులు తీసుకుందాం అన్నాడు" గాద్గదిక గొంతుతో అంది.

"అటు భర్త అనురాగానికి దూరమై, ఇటు ఎవరి ఆదరణానికీ నోచుకోని నేను ఎవరికోసం బ్రతకాలి!" వందన కళ్ళల్లోంచి జలజలా కన్నీరు కారి శేఖర్ చేతిమీద పడింది.

"వందనా?" వందన మాటలకు దెబ్బతిన్నట్లు చూశాడు శేఖర్.

"కన్నవారికి, తోబుట్టువులకు దూరంగా, ఈ దేశం కాని దేశంలో ఎవరితో చెప్పుకోను నా బాధ? ఎవరి దగ్గర పొందను ఓదార్పు?"

మొహం రెండుచేతులతో కప్పుకుంది.

ఏడుస్తున్నట్లు భుజాలు కదులుతున్నాయి.

'తనింత బేలా?' అని వందనకే ఆశ్చర్యంగా వుంది. హుం ...ల ప్రభావం.

"వందనా....!" శేఖర్ కళ్లల్లో బాధ విలవిల్లాడింది.

"వందనా నిజం చెప్పు నేను నీకేమీ కానా?" వందన మొహం ... చేతులు తొలగిస్తూ అన్నాడు.

...న మాట్లాడలేదు.

...ప్పు వందనా? ఎవరూ లేరని వాపోతున్నావు? ఆ-మాట ...లోంచి వచ్చిందేనా?" సూటిగా చూస్తూ అడిగాడు.

... వందనా? నేను నీకు పరాయివాడినయ్యానా?"

రెట్టించాడు,

"కారా? సుష్మ...."

"టు హెల్ విత్ సుష్మ. మా మధ్య భార్యాభర్తల అను బంధం ఎప్పుడో తెగిపోయింది. విడిపోవడానికి నిశ్చయించు కొన్నాను."

"శేఖర్" నమ్మలేనట్లు చూసింది.

"నేను 'రిజైన్' చేసి ఇండియా వెళ్ళిపోతున్నాను. సుష్మ బహుశా యిక్కడే సెటిల్ అయిపోవచ్చు" నిర్లిప్తంగా అన్నాడు.

"నేనూ అమ్మవాళ్ళదగ్గరికి వెళ్ళిపోదల్చుకొన్నాను. పాస్‌పోర్ట్ కూడా తొందరలోనే రావచ్చు. నరేన్ యింకో నాల్గు నెలలకుగాని రాలేడు."

చాలాసేపు ఎవరూ మాట్లాడలేదు.

వందన మాత్రం ముక్కు తుడుచుకుంటూంది అప్పుడప్పుడు.

శేఖర్ మనసులో తళుక్కుమని ఓ ఆలోచన మెరిసింది. అవునూ! నరేంద్ర సుష్మల ఊహ నిజంచేస్తే!!

"వందనా!" హఠాత్తుగా పిలిచాడు శేఖర్.

ఏమిటన్నట్లు చూసింది అతనివైపు.

"నాతో జీవితం పంచుకోటానికి నీకేమైనా అభ్యంతరమా?" సూటిగా అడిగాడు. నవ్వేసింది వందన.

"శేఖర్! మతి వుండే మాట్లాడుతున్నారా?"

"డార్లింగ్! నా మనసు తెలియనట్లు నటించకు. పెళ్ళి చేసుకోవాలనే 'కోరిక' నిన్ను చూశాకే బలపడింది. జరిగిందేదో జరిగిపోయింది. ఐ రియల్లీ మీన్ యిట్. నీకిష్టమే కదూ."

ఇష్టమా! తొలివలపు చిగురించింది ఇతని పరిచ కదూ!

"శేఖర్! ఇది సాధ్యమా?"

"ఎందుకు కాదు! ముందు మనిద్దరం కలిసి ఇండియా వెళ్ళిపోదాము. లీగల్‌గా విడాకులు తీసుకు

పెళ్ళి చేసుకుందాం. మనలాంటి సున్నిత మనస్కులు యిలాంటి వాతావరణంలో ఇమడరు. ఏమంటావు?"

వందన అతని కళ్ళల్లో చూసింది.

"ప్రామిస్ యు విల్ నెవర్ రనఎవే ఫ్రం మి దిస్‌టైమ్"

చాచిన వందన చేతిలో చేయివేసి "ప్రామిస్" అంటూ దగ్గరకు లాక్కున్నాడు.

"రాజా" అప్రయత్నంగా పిలుస్తూ ఆనందంగా అతని గుండెల్లో వదిగిపోయింది.

వందన గడ్డంక్రింద కుడిచేయివేసి మొహం పైకెత్తాడు శేఖర్.

వందన కళ్ళల్లో నీరు! హృదయంలో శేఖర్‌పై దాగివున్న ప్రేమ ఆనందబాష్పాలుగా రాలిపోతున్నాయి.

"ఛీఛీ కన్నీరు పెట్టాల్సిన తరుణం కాదిది. ఎప్పుడూ నవ్వుతున్నట్లుండే నీ యీ అందమైన కళ్ళల్లో ఇంకెప్పుడూ కన్నీరు చిందకూడదు. ఎల్లప్పుడూ అనురాగం, ప్రేమ చిందించాలీ కనుదోయి. అదీ నాపైనే సుమా" నవ్వుతూ వందన బుగ్గలపై కారుతున్న కన్నీళ్ళను తుడిచి ఆ అందమైన కళ్ళను ముద్దుపెట్టుకున్నాడు.

అతని గుండెల్లో మరింతగా ఒదిగిపోయింది.

"ప్రామిస్ నెవర్ టు చేంజ్ యువర్ మైండ్. ప్రామిస్ నెవర్ టు లీవ్ మీ" వందన మొహం పైకెత్తుతూ అడిగాడు.

"ఐ ప్రామిస్....ఓ రాజా....ఇదంతా కలగా వుంది" వందనను హృదయానికి ఆర్తిగా, గాఢంగా హత్తుకుంటూ ఇలా అన్నాడు:

"కలకాదు హనీ! కలగా మిగిలించుకున్నది వాస్తవమైట నిలిచింది. ఐ లవ్ యు" లోకంలోని అనురాగమంతా ఇది ఆ మృదుగంభీర స్వరంలో.

ఓ రాజా....నెవర్ లీవ్ మీ, నెవర్ లీవ్ మీ...." మరి వ్వలేదు శేఖర్.

* *

అమ్మకు,

శుభవార్త! నేను త్వరలో 'ఇండియా' రాబోతున్నాను.

మిమ్మల్ని చూడాలని ఎంతగా తహతహలాడుతున్నానో తెలుసా! అబ్బ! ఎన్నాళ్ళయింది మిమ్మల్ని చూసి? ఇక్కడ మనవాళ్ళున్నా మీరున్నట్లుండదు కదమ్మా!

నాన్నగారి 'ప్రాక్టిస్' ఎలా వుంది? నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో. తమ్ముడు బాగా చదువుతున్నాడా? వచ్చేటప్పుడు వాడు అడిగింది తీసుకువస్తానని చెప్పు. అన్నట్లు చెల్లెలి చదువయిపోయింది కదా! సంబంధాలు చూస్తున్నారా? ఫారిన్‌లో వుండేవాడు మాత్రం వద్దమ్మా. ఎందుకంటే...." ఆగిపోయింది కలం.

వాళ్ల ప్రలోభాలకూ, కృత్రిమ ఆకర్షణలకు లొంగిపోతారని రాయాలా?

ఇక్కడికి రాగానే వారి దృక్పథం, మనస్తత్వం మారి పోతుంది, అన్నివిధాలా చెడిపోడానికి ఆస్కారం వుందని, సుఖ పడాలంటే, ఇలా దూరదేశంలో, కన్నవారికి దూరంగా వుండ కూడదని వ్రాయాలా? అందుకు నిదర్శనం నరేన్, తనే అనాలా?

ఆలోచిస్తున్నట్లుగా కళ్ళు మూసుకుంది వందన. అందరూ అలాగే వున్నారా? అందరి జీవితాలు అలాగే వున్నాయా?

చెడిపోవడం అనేది మనిషి వ్యక్తిగతమైనదని, వ్యక్తిత్వం మీద ఆధారడివుంటుంది గాని, కేవలం పరిసరాలమీద ఆధారపడి వుంటుంది అని, ఖచ్చితంగా యెలా చెప్పడం? శేఖర్ దాని తార్కాణం కాదా!

రెడ్డి దంపతులు అన్యోన్యంగా, సుఖంగా హాయిగా లే తన ఖర్మ, శేఖర్ దురదృష్టం కాకపోతే తమ జీవితా లెందు అస్తవ్యస్తం కావాలి? ఎందుకు తమ బ్రతుకులిలా చిందర అయిపోవాలి? పరిస్థితు లెందుకింత అయోమయంగా, భ అగమ్యగోచరంగా వుండాలి?

వందన కనుబొమలు ముడివడ్డాయి కొద్దిగా! ఛ... కింత చాదస్తంగా ఆలోచిస్తోంది? ఇంత సెంటిమెంట అవుతోందేమిటి రాను రాను?

శేఖర్ జ్ఞాపకం వచ్చాడు.

శేఖరం పెదవులపై ఎప్పుడూ మనోజ్ఞంగా చిరునవ్వు వెలుగుతూంటుంది. గుండెల్లో బడబాగ్ని దాచుకొని, సుష్మ వలన ప్రత్యక్ష నరకం అనుభవిస్తూ, ప్రతిక్షణం అవహేళనకు గురియైన జీవితం, ఏమాత్రం సుఖం శాంతిలేని జీవితాన్ని గుడుపుతూ కూడా ఎప్పుడూ ప్రశాంతంగా వుండే మొహం, జీవితాన్ని కాచి వడబోసిన జ్ఞానిలాగా నవ్వుతూ కన్పించే శేఖర్ తన్నాశ్చర్య పరిచాడు.

అదే అడిగింది తనొకనాడు. శేఖర్ సమాధానం తన్ను కాస్త సిగ్గుపడేటట్లు చేసింది.

"జీవితంలో అత్యంత విలువైనది నవ్వు అన్నారు. ఎన్ని సమస్య లొచ్చినా దాన్ని వదలకూడదట. అయినా చూసేవాళ్ళకి మనం బాధపడ్తున్నట్లు ఎందుకు కన్పించాలి? వాళ్ళు అవహేళన చేయడానికి, మాట్లాడుకోవడానికి మరింత అవకాశం కలిగించడం కాకపోతే? వందనా నా పాలసీ ఏమిటో తెలుసా? నవ్వితే నల్గురితో కలసి నవ్వు. ఏడిస్తే దూరంగాపోయి ఒంటరిగా ఏడ్వు! మనం ఇతరులకు సుఖాన్ని పంచాలిగాని, దుఃఖాన్ని కష్టాల్ని కాదు. అలా కష్టాల్ని పంచుకోగలిగే హక్కు ఒక్కరికే వుంటుంది. ఆ హక్కు మన మనసుకు అతి సమీపంగా వచ్చి, మనల్ని అమితంగా అభిమానించే ఆత్మీయులకు మాత్రమే వుంటుంది. కన్పించిన ప్రతి వ్యక్తితోనూ కష్టాల్ని ంచుకునే అధికారం మనకు లేదు కూడా."

ఎంత చక్కగా చెప్పాడు శేఖర్.

అయితే అమ్మ నాన్న తనకు ఆత్మీయులుకారా? వారితో తన పంచుకోగలదా? నరేన్ విషయం వ్రాయాలా వద్దా? అమ్మో.... బలహీనంగా వున్న అమ్మ గుండె ఆగిపోతే?

ఊహుఁ! ఎలాగూ వెళుతోంది కదా! ఏకంగా అప్పుడే ఉత్తరంలో వ్రాసి వాళ్ళని బాధపెట్టకూడదు.

సలు తన పిచ్చిగాని, తనకు బాధ అనేది ఇకమీదట వుండ శేఖర్ తనకు అండగా వుంటాడుగా. శేఖర్ సాహ తనకు కష్టం తెలయదనుకుంటోంటే మనసు తేలిక ది.

దృష్టి వ్రాస్తూ ఆపిన ఉత్తరంమీదనిలిపింది. "...ఎందుకంటే ....ఎందుకంటే....మిమ్మల్ని చూడాలనిపించినపుడు రావడం పడదు కనుక. ఒక్కోసారి మీరంతా జ్ఞాపకం వచ్చి, రెక్కలు కట్టుకొని వాలాలనిపిస్తుంది.

చెల్లికి ఇంకా రేడియోపిచ్చి వదలలేదా? దానికి నచ్చే చక్కని బహుమానం తెస్తున్నానని చెప్పు. చాలా చాలా వ్రాయాలని వుంది. కాని త్వరలో మిమ్మల్ని చూడబోతున్నాననే ఆనందంతో మనసు మూగపోయినట్లయి కలంకూడా 'అన్నీ సమక్షంలో స్వయంగా నీ నోటితో విన్నవించుకొందువుగాని' అన్నట్లుగా ముందుకు సాగనని మొరాయిస్తోంది. నేను వచ్చేముందు ఏ ఫ్లైట్‌కు వస్తున్నది 'కేబుల్' యిస్తాను. నువ్వు అనవసరంగా హైరాణపడకు. నాన్నగారికి నా నమస్కారములు అందజేయి.

నీ ప్రియమైన,
పాప.

ఉత్తరం పూర్తిచేసి వెనక్కి కుర్చీలో వాలిపోయింది వందన.

* * *

"పోస్ట్"

పోస్ట్‌మాన్ చేతిలోని 'ఎయిర్ మెయిల్' చూడగానే 'హుర్రే' అంటూ రవి, అంజన పరిగెత్తారు వీధిగుమ్మంవైపు. ఇంతలో బయటకు వచ్చిన జానకమ్మ చేతికి కవరిచ్చి వెళ్ళిపోయాడు, ఇద్దరు యిటు తిరిగి చూసేసరికి.

'బాబోయ్! అమ్మచేతిలో కవరు పడిందంటే, కళ్ళజో వెతుక్కొని, అక్షరాలు కూడబలుక్కొని చదివేసరికి గోవింద' అనుకున్నారు.

"ఎక్కణ్నుంచిరా! పాప దగ్గర్నుంచే కదూ" అంటూ బోయింది జానకమ్మ.

"అబ్బే అలా కాదమ్మా! ఇలా యియ్యి నేను చ తల్లిచేతిలోంచి కవర్ లాక్కున్నాడు.

"నేనూ అలాగే కదురా చింపబోయింది."

తల్లి మాటలు పట్టించుకోకుండా చింపి చదవబోయాడు.

"అహఁ అలా కాదు చదివేది. ఇలా" అంటూ సర్రుమని రవి చేతిలోని కవరు లాక్కుంది అంజన.

అందరికీ ఆత్రంగా వుంది చదవాలని.

రవికి కోపం వచ్చేసింది. 'ఏయ్' అంటూ అంజనమీద పడి నంత పనిచేసి లాక్కోబోయాడు.

చటుక్కున వెనక్కు దాచేసి అడుగులు వెనక్కి వేస్తూంది అంజన.

"ఏయ్ నిన్నే ఇలా యియ్యి" వెనక్కి వెళ్ళి లాక్కోపోయాడు. రవికి అందకుండా ఆ చేతిలోంచి యీ చేతిలోకి మార్చేస్తోంది.

"ఏమిటి ఆ తొందర? నేను చదివేసి యిస్తాను."

"ఆ పని నేనే చేస్తాను. మర్యాదగా యిలా యియ్యి" బెది రించాడు రవి.

"ఏమిటోయ్ నీ బోడి బెదిరింపు? నీ పేరున వచ్చిందేమిటీ ఉత్తరం?" దబాయిస్తూ అడిగింది.

"నీ పేర్న వచ్చిందేమిటి?" రోషంగా అన్నాడు.

మునికాళ్ళమీద నిలబడి పైకెత్తిన అంజన చేయి గట్టిగా పట్టుకుని క్రిందకు వంచి లెటర్ అందుకోపోయాడు రవి. ఇంతలో జానకమ్మ వచ్చి లెటర్ అందుకుంది.

"అసలు నా కొచ్చిన ఉత్తరాన్ని మిమ్మల్నెవడు చూడ మన్నాడు?"

ఇద్దరూ బిక్కమొహం వేసారొక క్షణం. కళ్ళజోడు వెతుకు జానకమ్మ దగ్గరి కెళ్ళారు.

"అమ్మా నువ్వు కళ్ళజోడు వెతుకు. ఇంతలో నేను చది- వేస్తాను ప్లీజ్" అంటూనే లెటర్ లాక్కుంది అంజన.

"నువ్వు అమ్మ కళ్ళజోడు వెతికిపెట్టు. ఇంతలోనే చదివి స్తాను ప్లీజ్" అంటూ లెటర్‌ను అంజన చేతిలోంచి లాగాడు.

"ఏయ్" మీద పడి లాక్కోపోతుంటే పైకెత్తి పట్టుకున్నాడు

రవి 'నన్నేడిపించావుగా' అంటూ.

ఎగిరి అందుకోపోయింది. అందింది అనుకున్న కవరు ఎవరో లాక్కున్నట్లయి అటు చూపింది. రవి వెనగ్గా తండ్రి నిల్చున్నాడు.

"నాన్నా!"

"నేను చదువుతాను. అందరూ నోరు మూసుకు వినండి."

ప్రియమైన అమ్మకు,

"నీకో శుభవార్త...."

"ఏమండీ! నిజంగా అలా వ్రాసిందా! లేక మీరు అలా చదువుతున్నారా?" అనుమానంగా అడిగింది జానకమ్మ.

"అలా వ్రాయకపోతే ఎలా చదువుతారండీ" భార్యను వెక్కిరించాడు.

"అయితే....అయితే పాప నీళ్ళోసుకొని వుంటుందండి" సంబరంగా అంది జానకమ్మ.

"నీ మొహం! అలా అని వ్రాయలేదు."

"చలిప్రదేశం కదూ! రోజూ నీళ్ళు పోసుకోరట. ఆ రోజు స్నానం చేసిందేమో" తల్లిని ఆటపట్టించాడు రవి.

"ఛ నోర్మూయ్! ఎప్పుడూ వేళాకోళమే" భర్తవైపు తిరుగుతూ అంది. "అంతకంటే ఇంకెలా వ్రాస్తుందండీ. మనల్ని చూడాలనివుందని వ్రాసింది! పిచ్చితల్లి! ఎంత యిబ్బందిపడుతోందో! ఎన్నో నెలట! ఎప్పుడొస్తుందిట" ఆత్రంగా అడిగింది జానకమ్మ—

"అదేం వ్రాయలేదు. అయినా పూర్తిగా చదవనిస్తే నువ్వు? మధ్యలో నీ యక్ష ప్రశ్నలూ, ఊహాగానాలునూ."

"సర్లెండి చదవండి త్వరగా" తొందర పెట్టింది భర్తని

"....తమ్ముడు బాగా చదువుతున్నాడా? వచ్చేటప్పుడు అడిగింది తీసుకువస్తానని చెప్పు...." అని చదివి రవివైపు చ

తల వంచుకున్నాడు.

"ఏరా? ఏం తెమ్మని వ్రాశావేమిటి?"

నసుగుతూ చెప్పాడు రవి "ఒక వాచ్.ఒక కెమెరా

"అంతేట. ఏం ఇక్కడి వస్తువులు పనికిరావా

గూడ్సుమీద ఆ మోజేమిటి? కస్టమ్స్‌వాళ్లు పట్టుకుంటే యెంతెంత టాక్సు వేస్తారో తెలుసా?"

"సర్లెండి, ముందేం రాసిందో చదవండి. అసలిలా ఇవ్వండి. నేనే చదువుకుంటాను."

ఆయన చదువుతున్నారు. "రెక్కలు గట్టుకుని వాలాలని పిస్తుంది." ఒక్కక్షణం ఆయన కళ్లు చెమరించాయి.

"పాపం యెంత యిదవుతోందో" జానకమ్మ కళ్ళు తుడుచుకుంది.

"....చెల్లెలికి రేడియోపిచ్చి వదల్లేదా? దానికి నచ్చే చక్కని బహుమానం తెస్తున్నా...." అంజనవైపు చూసారు.

తేలు కుట్టినదానిలా తలవంచుకుంది.

ఈ అక్కకసలు బుద్ధిలేదు. అమ్మకు రాసేదాంట్లో యెందుకిదంతా వ్రాయాలి? నాన్న చదువుతారని తెలియదూ?

"రాణిగారేం వ్రాసారో?" అంటున్న రవివైపు కోపంగా చూసింది.

"ఇంకేం వ్రాసుంటుంది? ట్రాన్సిస్టర్ తెమ్మని వుంటుంది?" జానకమ్మ అంది. "ఆఖరికి బాత్‌రూంలోకి కూడా ట్రాన్సిస్టర్‌ను వెంట తీసుకువెళుతుంది అంజన. అన్నిభాషల పాటలు వింటూంటుంది. ఇరవైనాలుగు గంటలూ రేడియో వాగాల్సిందే. ఏమైనా అంటే మంచి పాట యెక్కడ 'మిస్' అవుతుందోనని భయంట."

"నిజమేనా" తండ్రి అడిగాడు.

"ట్రాన్సిస్టర్ కాదు నాన్నా ట్రాన్సిస్టర్ కం టేప్‌రికార్డర్"

"మరే అదయితే యెంచక్కా ట్రాన్సిస్టర్‌లో వచ్చే పాట రికార్డ్ చేసుకుని, పాటలు రానప్పుడు యెంచక్కా రికార్డ్సు ...టి" వెక్కిరించాడు రవి.

"నువ్వు మాత్రం? ఎంచక్కా రోడ్డుమీద పోయే అమ్మా... ...ఫోటో తీయవచ్చు."

అబ్బబ్బ....ఆపండిరా మీ గోల. ఒక్క క్షణం పడదు బద్ధశత్రువుల్లా కీచులాడుకుంటా రెప్పుడూ. మీరేమిటండీ? ...ధం

బెల్లంకొట్టిన రాయిలా? ఊ( చదవండి ఆ తర్వాతేమిటో" పిల్లలమీద విసురు భర్తమీద కాస్త చూపింది.

"బాగుంది వరస. మధ్య నామీద యెగురుతావేం? ఇంకేం రాయలేదు. వచ్చేముందు కేబుల్ యిస్తానంది. అంతే."

"పాపం! ఒంటరిగా యెంత బాధపడుతోందో? నోరుతెరచి చెప్పుకోడానికి కన్నవాళ్ళెవరున్నారు దగ్గర? మనసయింది చేసి పెట్టడానికి? సర్లెండి. ఒక కవరుంటే యిలా పడేయండి. దానికి వ్రాపి పడేస్తాను. అదెప్పుడు చేరేనో?"

వందన వ్రాసిన లెటర్ చూసి ఆమె నిర్ధారణ కొచ్చేసింది.

* * *

నరేన్ అన్నప్రకారమే 'పిక్నిక్'కు వెళ్ళాడు అందరితో. వందనను అడగలేదు రమ్మని. అడిగినా వెళ్ళాలనుకోలేదు వందన. నుదిటిమీది గాయం యింకా పూర్తిగా మానలేదు. ప్లాస్టర్‌తో వెళితే ఏమిటని ప్రశ్నిస్తారు. చెప్పిన సమాధానం నమ్మరు. పైగా నరేన్‌కు తనకు మధ్య పెద్దగా సామరస్యంలేదని నరేన్ ప్రవర్తనద్వారా స్పష్టంగా చాటింపు వేసేశాడు. ఇలాంటి పరిస్థితులలో తను వెళ్ళక పోవడం ఉత్తమం అన్పించి మానేసింది వందన.

ఒంటరిగా సోఫాలో కూర్చుని రవి, అంజనగురించి ఆలో చిస్తోంది. హఠాత్తుగా వాళ్ళడిగినవి జ్ఞాపకం వచ్చింది. ఎప్పుడు వెళ్ళాల్సి వస్తుందో సరిగ్గా తెలియదు. ఈలోపుగా 'షాపింగ్' అన్నీ పూర్తిచేసుకుంటే మంచిదనిపించింది.

షాపింగ్‌కు బయలుదేరింది వందన.

ముందు అంజనకోసం చీరలుకొంది. అక్కణ్ణించి 'రే షాప్'కు వెళ్ళింది. సెట్ చూస్తోంది వందన.

"వందనా" శేఖర్ గొంతు విని ఆశ్చర్యంగా తిరిగి వందన.

"ఓ రాజా! నువ్వెళ్ళలేదా పిక్‌నిక్‌కు?"

"లేదు. వెళ్ళాలనిపించలేదు. అదీకాకుండా స్టూడెంట్స్‌కు హెల్ప్ చేయాలనిపించింది."

"ట్రాన్సిస్టర్ సెట్ చూస్తున్నావా? నేనూ అందుకనే వచ్చాను."

"మా చెల్లెలు తెచ్చిపెట్టమంది. నువ్వెవరికోసం?" అడిగింది శేఖర్‌ను.

"నేనూ మా చెల్లెలికోసమే. తెచ్చిపెట్టమని ప్రతి లెటర్ లోనూ మరీ మరీ వ్రాస్తూంటుంది. అసలు లెటర్స్ వ్రాయడం అందు కోసమే. నాకిష్టం ఉండవు యిలాంటివి. వాళ్ళకెందుకో యింత మోజు వీటిమీద? తీసుకురాకపోతే నిష్ఠూరాలు. ఇంకో చెల్లెలు 'గ్రైండర్' అడిగింది. అవి యిక్కణ్ణుంచి తీసుకువెళ్లాలంటే ఎన్ని అవస్తలు పడాలో, కస్టమ్స్‌వారు పట్టుకుని 'టాక్సు' యెంతెంత వేస్తారో చెప్పినా అర్థంకాదు వాళ్ళకు. డబ్బుకోసం వెనకాడు తున్నా రనుకుంటారు."

నవ్వింది వందన. ఇద్దరూ వెనుతిరిగారు కొనుక్కొని. మిగిలిన షాపింగ్ కూడా ఇద్దరూ కలిపి పూర్తిచేసారు.

వందనను వందన ఫ్లాట్ దగ్గర డ్రాప్‌చేసి వెళ్ళబోయాడు.

లోపలికివచ్చి 'టీ' తీసుకు వెళ్ళమంది.

లోపలికి వెళ్ళబోతూ యధాలాపంగా 'పోస్ట్‌బాక్స్' లోకి చూసిన వందనకు పరిచయమైన దస్తూరిలో తనకు అడ్రస్ చేయబడిన కవర్ కన్పించింది.

'హాయ్' అనుకుంటూ కవర్ సంతోషంగా తీసి చింపింది. దవబోయి, శేఖర్ తనకూడా ఉన్నాడని గుర్తుకు వచ్చింది.

"ఓ....సారీ! కూర్చో రాజా! టీ చేసితెస్తాను" అంటూ పెద 'కెటిల్'లో నీళ్ళు పడేసింది.

ఆత్రంగా లెటర్ చదవనారంభించింది. అమ్మ వ్రాసింది.

ప్రియమైన పాప,

నువ్వందించిన శుభవార్త మమ్మల్ని చాలా ఆనందపరిచింది.

న్ను చూడాలని చాలా ఆత్రంగావుంది. రెక్కలు కట్టుకుని అనిపించినా కొన్నివేల మైళ్ళ దూరంలో వున్నావు కదా! ్వంది పడుతున్నావో అని మనసులో ఒకటే మధన పడు

తున్నాను. నా ఆరాటం చూసి ఇంట్లో మీ నాన్నతోసహా అందరూ ఆట పట్టిస్తున్నారు. తల్లి మనసు వాళ్లకేం తెలుసు? అన్ని జాగ్రత్తలు తీసుకుంటున్నావు కదూ. అయినా స్వయంగా డాక్టర్వి నీకు నేను వేరే చెప్పాలా? ఇంతకీ అసలు యెన్నో నెల?"....
హఠాత్తుగా ఆగిపోయింది వందన చూపు అక్కడితో.

ఏమిటి అమ్మ అడిగేది? మొహం వివర్ణమయింది వందనకు. తను వస్తోందన్న కబురే శుభవార్త అని వ్రాస్తే, వీళ్ళు యిలా అర్థం చేసుకున్నారు? ఓగాడ్! మొహం మాడిపోయినట్లయింది వందనకు.

'శుభవార్త' అన్న పదం వాడి తనెంత పొరపాటు చేసిందో యిప్పుడు తెలిసి వచ్చింది! ఏంలాభం! వాళ్ళంతా యెంత సంబరంగానో యెదురు చూస్తూంటారు! ఎంత ఆత్రంగా వున్నారో?

కాని....కాని తను పూర్తిగా నరేన్‌తో తెగతెంపులు చేసుకుని వస్తోందని వాళ్ళకేం తెలుసు?

అసలే లేనిది ఉన్నట్లుగా ఊహిస్తున్న వాళ్ళకి యీ సంగతి యెలాంటి 'షాక్' యిస్తుందో?

భగవాన్! ఏమిటీ పరీక్ష!!

హఠాత్తుగా నీరసం ఆవరించినట్లయింది. భారంగా సోఫామీద వాలిపోయింది.

వందన పరిస్థితి గమనించాడు. తనే 'టీ' చేసి తీసుకువచ్చి వందనకు ఓ కప్పు అందించాడు.

"థాంక్సు! సారీ. అతిధిమర్యాద చేయకుండా ఉండ కాకుండా నీచేత చేయిస్తున్నాను" నీరసంగా నవ్వింది.

"ఇంకోసారి అలా మాట్లాడకు వందనా. నాక అన్పిస్తుంది. మన మధ్య 'సారీ'లు వుండకూడదు. అలా అంటే పరాయివాడివిగా నన్నుచేసి దూరం ఉంచు కుంటాను" సీరియస్‌గా అన్నాడు.

"ఓ రాజా! నీకెందుకింత అభిమానంనేనంటే?"

ఆ ఆత్మీయత అనురాగం చూస్తూంటే కళ్లు చె

వందన కెందుకో లోలోపల భయంగావుంది! ఈ అనురాగాన్ని యెలాంటి అడ్డూ సంకోచం లేకుండా అందుకోగలదా! చివరిదాకా అనుభవించగలదా? ఉత్తరం తిరిగి చేతిలోకి తీసుకుంది.

'....నీతో నరేన్‌కూడా వస్తున్నాడా? వీలైతే రమ్మను. జంటగా వెళ్ళారు జంటగానే రావాలని ప్రయత్నించండి. నరేన్ నిన్ను జాగ్రత్తగా చూస్తున్నాడనుకుంటున్నాం. అయినా నరేన్‌కు నీమీద ఉన్న ప్రేమ మాకు తెలియందికాదు. నిన్నెంత అపురూపంగా చూసుకునేవాడు ఇక్కడున్నప్పుడు! అంతా నీ పూర్వజన్మ సుకృతం! యీ జన్మలో యింత అదృష్టవంతురాలివయ్యావు....' ఇంక ఆపుకో లేక పైకి ఏడ్చేసింది. మొహం చేతులతో కప్పేసుకుంది.

చటుక్కున శేఖర్ దగ్గరకు వచ్చాడు. "ఏమిటి వందనా? ఏమైంది?" మొహం మీదనుంచి చేతులు తొలగించాడు.

"అక్కడ అందరూ కులాసాగానే వున్నారు కదా! లేక యెవరికైనా జబ్బుచేసి...." ఆపేసాడు ప్రశ్నార్థకంగా.

కాదన్నట్లుగా తలవూపి లెటర్ అందించింది మౌనంగా.

ఒక్కక్షణం, సంశయించడం చూపి 'పర్వాలేదు చదువు తెలుస్తుంది' అని ఏడుపు ఆపుకోడానికి ప్రయత్నించింది. అయినా వెక్కుతూనే వుంది.

చదివాడు శేఖర్. మొహంలో ఏ భావం ద్యోతకమౌతూందో ...యలేదు. వందనవైపు చూశాడు.

"నరేన్ విషయం వ్రాయలేదా?"

లేదన్నట్లు తల వూపింది.

"అమ్మ వాళ్లు యీ విషయం యెలా తీసుకుంటారో? ...న్న జీవితం తలచుకుంటూంటే నాకు భయంగా వుంది"

...ం అన్నట్లు శేఖర్ చేయి పట్టుకుంది.

...యం యెందుకు వందనా నేనుండగా. విచక్షణ తెలియవి ...ం అంటే భయంగాని నీకెందుకు భయం" ధైర్యం ...ా చేయి నొక్కాడు.

...ంచెప్పు వందనా! నీకు నామీద పూర్తిగా నమ్మకం

వుందా? నేనంటే అనురాగం వుందా? నాతో జీవితం పంచుకో గలవా?" సూటిగా అడిగాడు.

'ఉందన్నట్లు యిష్టమన్నట్లుగా' తల వూపింది.

"మరి భయం యెందుకు? నువ్వు సుఖంగా వుండటమే కదా మీవాళ్ళకు కావలసింది. మీ అమ్మ మాత్రం ఏమంటారు!"

వందన మాట్లాడకుండా తలెత్తి చూసింది. ఆ కళ్ళల్లో యెందుకో భయం కదలాడుతూనే వుంది. వందనకే తెలియడంలేదు యెందుకో. అది చూసిన శేఖర్‌కు అనుమానంలాంటిది కలిగింది. కళ్ళు చురుగ్గా అయినాయి.

పరీక్షగా చూస్తున్నట్లుగా వందన కళ్ళల్లోకి చూసాడు.

"నువ్వు మనసులో యెలాంటి సంకోచాలు పెట్టుకోకు వందనా. ఐ లవ్ యూ. నిన్ను నిన్నుగానే ప్రేమించగలను. ఎలాంటి పరిస్థితులోనైనా నిన్ను నిండు మనసుతో స్వీకరించగలను. నువ్వు ముందు భయాన్ని దరిదాపులకు కూడా రానీకు. భయం అనేది మన మనసును తెరలతో కప్పేస్తుంది. కళ్ళను వేటిని సరిగ్గా చూడనీయదు. విచక్షణాజ్ఞానాన్ని కూడా కోల్పోయేలా చేస్తుంది. కాబట్టి భయం అంత భయం కలిగించేది యింకోటి లేదు. దేన్నైనా నిర్భయంగా యెదుర్కోవాలి. ఏవిషయాన్నైనా నిర్భయంగా నిస్సంకోచంగా చెప్పేయాలి."

భుజాలమీద చేతులేశాడు.

వందనకు శేఖర్ మాటలు అర్థంకావడంలేదు. "ఏ నువ్వనేది?" తడబడుతూ అడిగింది.

"నువ్వేదీ దాచకు. నేను చెప్తున్నానుగా ఐ లవ్ య మనసులో ఏదో భయం ఉన్నట్లుంది. మీ అమ్మ వ్రాసిన నాకు తెలిస్తే నా మనసు మారుతుందనేనా?"ఆప్యాయంగా

చివ్వున తలెత్తింది వందన. "శేఖర్ మా అమ్మ దనుకుంటే నువ్వుకూడా అలాగే పొరబడుతున్నావు" చిప్పరిల్లింది వందన కళ్ళల్లో.

"అరె. అంతలోనే కన్నీరా? ముందు నువ్వలా

కన్నీరు నింపడం మానెయ్యాలి. నవ్వాలి. ఏదీ నవ్వుచూద్దాం! నవ్వగలవో లేదో చూస్తాను" గడ్డంపట్టి తల పైకెత్తాడు.

కళ్ళు తడితో మెరుస్తున్నాయి. చిన్నగా నవ్వింది వందన.

"అదీ అలా నవ్వాలి. నువ్వు నువ్వుగానే నాకు కావాలి" దగ్గరకు తీసుకున్నాడు.

వందనలో ఇపుడు యెలాంటి సంకోచం, భయం లేవు. దేన్నైనా ఎదుర్కోగల ధైర్యం, స్థైర్యం శేఖర్ స్పర్శతో తనకు వచ్చేసినట్లయింది.

* * *

"నరేన్ నేను యీ రోజు 'ప్లైట్'లో వెళ్ళిపోతున్నాను. కాలేజీలో నేను వ్రాసిచ్చిన కాంట్రాక్ట్ పూర్తి అయిపోయింది" చెప్పడం తన బాధ్యత కాబట్టి చెప్పింది వందన.

విన్పించుకోనట్లుగా బయటకు వెళ్ళిపోయాడు కారు తీసుకుని నరేన్. కాని వందన మాటలు బాగా విన్నాడు. అవి మనసులో బాగా నాటుకొన్నాయి కాబట్టి వందన ఎదురుగా నిలవలేకపోయాడు. ఇష్టంగా తిరిగాడు గమ్యం లేకుండా. 'వెళ్తుందిట వెళ్తుంది. ఎప్పుడు వీసాకు ప్లై చేసిందో యెప్పుడు 'పాస్‌పోర్ట్' తెప్పించుకుందో. కనీసం తో మాట మాత్రంగా కూడా చెప్పలేదు. యెంత ధీమా!' మనసు నే ఉక్రోషంగా అనుకున్నాడు.

'ఎంతసేపూ వందనపై కోపం తెచ్చుకోడానికి సాకు వెతుటావుగాని, వందనతో యెప్పుడైనా సౌమ్యంగా ప్రవర్తించావా? కు మాట్లాడటానికి అవకాశం యిచ్చావా? వందనను ప్రసన్నం డానికి ప్రయత్నించావా?' అంతరాత్మ ప్రశ్నించింది.

కేం పట్టింది ప్రసన్నం చేసుకోవడానికి? ఆడదై వుండీ అహంకారం అయితే నాకెంత వుండాలి' అహం నించింది.

ంత బాగా సమర్థించుకుంటున్నావు నీ అహంభావాన్ని? అహంకారంకాదు అభిమానం. అభిమానం,వ్యక్తిత్వం దీ భర్త ఛీత్కారం చేస్తూంటే పతివ్రతలా పడి

వుండదు. ఇది ఆధునిక యుగం. పైగా అంతర్జాతీయ మహిళా దశాబ్దం.'

'ఏదైనా కాని. తనకే అంత పట్టుదలవుంటే నాకు మాత్రం ఎందుకుండదు? నేను అన్నానే అనుకో కోపంలో భర్తగా ఆమాత్రం హక్కు అధికారం లేదా? నా మనసును ఆకట్టుకునే ప్రయత్నమే చేయదు. ఆ శేఖర్‌ను చూసుకునే ఆ ధీమా.'

కోపంగా అంటూ అంతరాత్మ నోరు నొక్కేసాడు.

'నన్ను కాదని ఎలా వెళ్తుంది?' కసిగా యాక్సిలేటర్ నొక్కాడు.

* * *

'సూట్‌కేస్' చేత పట్టుకుని గదిలోంచి హాలులోకి అడుగు పెడుతున్న వందన ఒక క్షణం నిరత్తురాలయింది. దగ్గరకేసిన తలుపులు తెరచుకుని నరేన్ వస్తున్నాడు. మాట విన్పించుకోనట్లుగా వెళ్ళినవాడు అంతలోకే వచ్చేశాడే. అరె, అదేమిటి నుదుటిమీంచి రక్తం కారుతోంది. అప్రయత్నంగా వందన చేతిలోంచి సూట్‌కేస్ జారి క్రిందపడింది.

"నరేన్ ఏమయింది? ఎలా తగిలింది దెబ్బ" వంద కంఠంలో ఆతృత డాక్టర్‌గా.

నీరసంగా ముందుకు అడుగువేయబోయి తూలిపడబో నరేంద్రను చటుక్కున పట్టుకుని ఆపింది. గాడ్! ఎంత ర ధారగా కారుతోంది ఇంకా! షర్టంతా తడిసింది.

మొద్దుబారినట్లయింది వందన మనసంతా.

"అబ్బ!" బాధగా మూల్గుతున్న నరేంద్ర కంఠం కర్తవ్యం స్ఫురింపజేసింది.

అతన్ని సోఫాలో కూర్చోబెట్టి, గబగబా గాయా నీటితో కడిగి, మందు పూసి కట్టు కట్టింది.

"వందనా" దీనంగా చూసాడు నరేంద్ర.

కాఫీ కప్పులోకి వంచుతున్న వందన వెనక్కి

"నన్ను క్షమించవూ."

మాట్లాడకుండా అతనికి కప్పు అందించింది. అందుకుంటున్న అతని చేయి వణకడం చూసి తనే అతని పెదవులకు కప్పు అందించి త్రాగించింది.

"నన్ను క్షమించవూ" వందన చేయి తన చేతిలోకి తీసుకుంటూ అడిగాడు.

"నేనెవర్ని క్షమించడానికి?" నిర్లిప్తంగా అంది చేయి లాక్కోడానికి ప్రయత్నిస్తూ.

నరేంద్ర చేయి వదలలేదు. బిగించి పట్టుకున్నాడు. "వద్దు అలా అనకు. నేను చేసిన పొరపాటుకు క్షమాపణ వేడుకుంటున్నాను. జరిగిందానికి పశ్చాత్తాప పడుతున్నాను."

నమ్మలేనట్లు చూసింది వందన.

"ఓహ్! అలా చూడకు. నేను నిజం చెప్తున్నాను. బిలీవ్ మీ వందనా ప్లీజ్" దీనంగా అంటూ నీరసంగా అలసటగా కళ్ళు మూసుకున్నాడు.

"ప్లీజ్ నరేన్! రిలాక్స్ యువర్ సెల్ఫ్. మాట్లాడకు మరి. యు నీడ్ రెస్ట్. చాలా రక్తం పోయినట్లుందే" ఇంజక్షన్ యిస్తూ ంది వందన.

"నన్ను మాట్లాడనీ. చేసిన పాపం చెప్తే పోతుందంటారు. తా నీకు చెప్పి పాప ప్రక్షాళన చేసుకోనీ...."

ఏదో చెప్పపోయింది వందన.

"నో.... నన్నాపకు. నన్ను పూర్తిగా చెప్పనీ...." ఒక్షణం ూసుకున్నాడు నరేంద్ర.

ంతటి సుదినం ఈ రోజు. తన కళ్ళు తెరపించి రాయేదో, తెలియజెప్పింది ఇందాకటి సంఘటన.

నమీద కోపంతో యిష్టంగా తిరిగి ఎప్పటిలా సుష్మా డు నరేంద్ర.

పువ్వులా వుంది సుష్మా.

ం డార్లింగ్" నవ్వుతూ ఆహ్వానించింది నరేంద్రను.

 లైన్ క్లియర్ డియర్" నరేంద్రచేయి పట్టుకుంటూ

ఆనందంగా అంటూ ప్రక్కన కూర్చుంది.

"లైన్ క్లియరా?" అర్థంకాలేదు నరేంద్రకు.

"యస్ మై డియర్ బాయ్! శేఖర్ ఇండియా వెళ్ళి పోతున్నాడు ఈ రోజు ఫ్లైట్‌లో. వెళ్ళంగానే విడాకులకు ఏర్పాటు చేస్తానన్నాడు సాధ్యమైనంత తొందరగా."

నరేంద్రకు అంతా అయోమయంగా వుంది. సుష్మా తనే మళ్ళీ అందుకుంది "వాట్ ఇన్‌సిపిడ్ మాన్ శేఖర్ యీజ్. అతనెప్పుడూ జీవితంలో ఆనందం పొందలేదు. సుఖపడ్డం చేతకాని వాడు. అయాం సేవ్‌డ్!" హాయిగా ఊపిరిపీలుస్తూ అంది.

"అఫ్‌కోర్స్ ఐ డోంట్ హేట్ హిమ్. ఎంత అందమైన వాడు" రాజశేఖర్ అందమైన విగ్రహంపట్ల వ్యామోహం ఆ కంఠంలో విన్పించింది. "బట్ ఐ జస్ట్ కాన్ట్ లివ్ విత్ హిమ్" విస్కీ గ్లాసులోకి వంచి ఒకటి నరేంద్రకిచ్చి తానొకటి తీసుకుంది.

రెండోసారి వంపింది. త్రాగుతున్నారిద్దరూ.

హఠాత్తుగా సుష్మా తన రెండుచేతులను నరేంద్ర మెడచుట్టూ పెనవేసింది. అతని మొహంమీదికి వంగుతూ అడిగింది మత్తు వున్న కళ్ళతో చూస్తూ.

"టెల్ మీ డియర్! డు యు లవ్ మీ" యెందుకో మొ మొదటిసారిగా అతడు త్రాగుతున్న విస్కీ చేదుగా అన్పించింది.

"గాడ్! ఎంత కాంక్ష ఆ కళ్ళల్లో!" సుష్మా కళ్ళలోకి చూ అనుకున్నాడు.

మత్తును చిందిస్తున్నాయి ఆ కళ్ళు.

"ఉయ్ విల్‌బీ హేప్పీ టుగెదర్" నరేంద్ర మొ వైపుకు త్రిప్పుకుంటూ అంది.

చటుక్కున మొహం త్రిప్పేశాడు నరేంద్ర.

విసురుగా ఏదో అనబోయాడు నరేంద్ర.

ఇంతలో 'బెడ్‌రూంలోంచి ఫిలిప్స్ బయటకు

'బెడ్‌రూంలో ఫిలిప్స్!' నరేంద్ర కళ్ళు ఆశ్ మానంతో పెద్దవయ్యాయి.

ఫిలిప్స్ సుష్మా పెదవులను సున్నితంగా ముద్దుపెట్టుకుని అంటున్నాడు "థాంక్యూ హనీ! ఐ హేడ్ ఎ నైస్ టైం" వెళ్ళిపోయాడు.

నరేంద్ర కళ్ళల్లో అనుమానం, ఆశ్చర్యం ఎగిరిపోయి అసహ్యం చోటుచేసుకుంది.

సుష్మా గురించి అందరూ అనుకునేది 'గాసిప్' అనుకున్నాడు. తనతో తిరుగుతూందని, తనని ప్రేమిస్తూందని అందరికీ జలసీ అనుకున్నాడు. తనతోనే తిరుగుతూందని భ్రమపడ్డాడు. ఎంత మూర్ఖుడు తను! తిరగనేర్చిన ఆడది....

సుష్మాకేసి చూసాదు తదేకంగా.

వడలిన పువ్వులా వుంది సుష్మా.

అంటే....అంటే

మనసులో ఉప్పెనలా పొంగబోతున్న అసహ్యాన్ని అతి ప్రయత్నం మీద అణచుకున్నాడు.

ఎంత ఫూల్‌నిచేసి ఆడించింది తనని. తన మనసులో నాకు తప్ప వేరే ఎవరికీ చోటు లేదంది. నన్ను ప్రేమించానంది.

అదే అడిగాడు.

అదో పెద్ద జోక్ అయినట్లు నవ్వింది.

"ఓ వాట్ నాన్సెన్స్! ఇప్పుడూ అదే అంటున్నాను. అందుకే న్న పెళ్ళిచేసుకోమంటున్నాను. ఊ కమాన్ డియర్. 'టుమారో యీజ్ టూ లేట్. లివ్ టుడే' అన్నాడో రచయిత తెలుసా!" ా భుజంమీద చేతులు వేయబోయింది.

విదిల్చికొట్టాడు.

పెళ్ళా! నీ తోనా!" జుగుప్సగా జూస్తూ అన్నాడు "నిన్ను చూ స్తేనే చాలా అసహ్యంగా వుంది"కంపరంగా సుష్మాను ాసాడు.

హాఁ అలాగా! నాతో తిరిగినప్పుడు, నా వెనకాల కుక్కలా మయింది...." వ్యంగ్యంగా అంది కుక్క అన్నచోట

"షటప్ యూ బిచ్" కోపంగా సుష్మాచెంప ఛెళ్లుమని పించాడు.

"బుద్ధున్న ఏ మగాడు నిన్ను పెళ్ళిచేసుకోడు. అయినా నీలాంటి తిరుగుబోతుకి, ప్రాస్టిట్యూట్‌కి పెళ్ళికూడా ఎందుకు? కొరివితో తల గోక్కోవడం కాకపోతే."

చెంపదెబ్బ తినడంతోనే రెచ్చిన సుష్మా యీ మాటలతో మరింత రెచ్చింది.

"ఏం కూశావ్ నువ్వు. నేను ప్రాస్టిట్యూట్‌నా? మరి నీ పెళ్ళాం ఎవరో...." ఇంకా ఏదో అనబోయిన సుష్మా చెంప మరో సారి ఛెళ్ళుమంది.

"ఇంకోసారి వందన పేరెత్తావో చూడు. ఆమె పేరు పలికే అర్హత కూడా నీకు లేదు."

"రేపీపాటికి నువ్వు కాళ్ళబేరానికి రాకపోతే చూడు."

"ఛీ నువ్వు కామపిశాచివి" నరేంద్ర మాట పూర్తికాక మునుపే సుష్మా విసిరిన గ్లాసు బలంగా నరేంద్ర నుదుటికి తాకి ముక్కలయింది.

అంతే! ఆపుకోలేని ఉద్రేకం, కోపం వచ్చేశాయి నరేంద్రకు "యూ....డెవిల్" అంటూ సుష్మా మెడ రెండుచేతులతో బిగిం పట్టుకుని, వెంటనే మనసు మార్చుకున్నట్లుగా బలంగా వెనక్కి త్రోసి విసురుగా వెళ్ళబోయాడు.

కెవ్వున కేక వినిపించింది.

వెనక్కి తిరిగి చూడటానికి కూడా అసహ్యమేసి, కుండానే వెళ్ళిపోయాడు.

కారు డ్రైవ్ చేసుకుంటూ వస్తున్న నరేంద్ర ను కారుతున్న రక్తం అంతవరకూ మలినమైన మనస్సును, శుద్ధి చేస్తూనట్లయింది.

వందన ఈ రోజు వెళ్తాననడం గుర్తుకొచ్చింది.

అహంకారం తొలగిపోయింది.

ఎంత మూర్ఖంగా వందనను దూరం చేసుకున్నా

పట్టుదల సడలింది నరేన్‌లో. వెళ్లి వెంటనే క్షమార్పణ అడగాలి.

క్షమిస్తుందా? నవ్వుతున్నట్లుండే వందన మొహం కళ్ళముందు నిలిచినట్లయింది.

"వందనా! ఐ లవ్ యూ" అనుకున్నాడు.

చేజారిపోబోతున్న వందన యింతకు పూర్వంకన్నా ఎంతో విలువైన వ్యక్తిగా, అపురూపమైన యువతిగా తోచసాగింది. దూరమైతేగాని వ్యక్తుల విలువ తెలియదంటారు యిదేకాబోలు.

చెప్పడం ఆపి ఆయాసంగా ఆగాడు నరేన్.

"ప్లీజ్ నరేన్! చాలా వీక్‌గా వున్నావు. ఎక్కువ మాట్లాడకు" చేతిగడియారం వంక చూసింది.

గాడ్! యింకో గంటకూడా లేదు టైం తను వెళ్ళడానికి. వెళ్ళాలి. రాజా వెయిట్ చేస్తూంటాడు.

కాని నరేన్! ఈ స్థితిలో వదిలివెళ్ళడానికి మనసు రావడంలేదు.

కాని శేఖర్ ఎదురు చూస్తూంటాడు.

కళ్లనిండా అనురాగంతో, నిండుమనసుతో తనను ఆహ్వానిస్తున్నాడు.

"భాషలకు స్వప్నాలకు తేడాలేదు. ఆచరణలో పెట్టని లోచనలు కరిగిపోయిన కలలతో సమానం" ఎక్కడో చదివిన క్యాలు గుర్తుకొచ్చాయి.

'నో....ఈ సారి తన కల కలగానే మిగిలిపోకూడదు. ష్టాన్ని చేజార విడవదలుచుకోలేదు.

తను భారతస్త్రీయే కాని, తనను వద్దన్న భర్తదగ్గర అభి చంపుకొని యెలా వుండటం.

ది తన వ్యక్తిత్వానికే సవాలు.'

ళ్ళలోని నిశ్చితాభిప్రాయం పసిగట్టినట్లుగా అన్నాడు నరేన్ ుపట్టుకుని "వందనా! ప్లీజ్ నన్మ నమ్ము. నన్ను వదలి కొద్దిదూరంలో పడిన సూట్‌కేస్‌కేసి చూస్తూ అన్నాడు.

ందనా! నిజం. నా...."

"ప్లీజ్ నరేన్. మీరు ఎక్కువగా మాట్లాడకూడదు" అంటూ నచ్చచెప్పబోయింది.

"ఫర్వాలేదు. నేను చెప్పేది మాత్రం నిజం. నా కళ్లకు అహంకారపు పొరలు, కామపుతెరలు విడిపోయాయి" దీనంగా అంటున్న అతని కళ్లలోంచి కన్నీరు కారుతోంది.

దృఢంగా బలంగావున్న మగాడి కళ్లల్లో నీరు తిరగడం చూసి వందన మనసు కొద్దిగా చలించింది. నిజంగానే అతడు పశ్చాత్తాపపడుతున్నాడు.

కరిగిపోతున్న మనస్సును గట్టిపరచుకొనేందుకా అన్నట్లు గట్టిగా కళ్ళు మూసుకుంది.

"నన్ను వదిలి వెళ్లిపోతావనుకోలేదు."

హుఁ! అభిమానం చంపుకుని ఎలా వుంటాననుకున్నాడు. కాని చాలా ఆలస్యంగా గుర్తించాడు. ఇప్పుడు తను ఏమిచేయగల స్థితిలో లేదు.

ఆమె మౌనం అతన్ని మరింత బాధిస్తోంది.

"ఐ లవ్ యూ వందనా. ఐ ఆల్వేస్ లవ్డ్ యూ. కాని మధ్యలో గ్రహణం పట్టినట్లుగా ఆ కామపిశాచి నన్ను పట్టింది. వందనా? వందనా!...."

"ప్లీజ్. మీకు రెస్ట్ అవసరం. అనవసరంగా హైరాణ పడ కండి...." ఇంకా ఏదో చెప్పబోతున్న వందనను అతని వాగ్ధాటి ఆపేసింది మధ్యలోనే.

"వందనా! నిన్నెలా నమ్మించను. పశ్చాత్తాపానికి నా కన్నీళ్లు నిదర్శనం కాదా."

రెండుచేతులూ పట్టుకున్నాడు.

ఓ గాడ్! నిజంగానే అతనికళ్ళు వర్షిస్తున్నాయి.

"నిన్ను నేను వదులుకోలేను. ప్లీజ్ యీసారికి నన్ను గుణాలలోకెల్లా ఉత్తమగుణం క్షమాగుణం అని నీకు తె కొక్క అవకాశం యిమ్మని ప్రార్థిస్తున్నాను. నన్ను క్ష వల్లనే అవుతుంది. చెప్పు వందనా. నన్ను క్షమించా

నన్ను వదలిపోనని అను. డోన్ట్ లీవ్ మీ డార్లింగ్. ప్రామిస్ యు డోంట్ లీవ్ మీ" చేయిచాస్తూ అడుగుతున్నాడు.

అతని హృదయం పశ్చాత్తాపంతో దహించుకు పోతోంది. తనలోని మంచితనాన్నే సవాలు చేస్తున్నట్లున్నాయి అతని మాటలు.

కాని.... ఎలా?.... ఎలా సాధ్యం?

"నువ్వు ప్రామిస్ చేస్తేగాని నాకు నిశ్చింత వుండదు. కమాన్.... ప్రామిస్."

"ప్లీజ్. తరువాత సావకాశంగా మాట్లాడుకోవచ్చు. మీరు ముందు కళ్ళుమూసుకుని నిద్రపోండి. ప్లీజ్! డాక్టర్‌గా చెపుతున్నాను. మీకు రెస్ట్ చాలా అవసరం. చాలా వీక్‌గా వున్నారు. యెక్కువ మాట్లాడం మీ ఆరోగ్యానికి ప్రమాదకరం."

"లేదు. లేదు. నువ్వెళ్ళిపోతావ్! నిన్ను వదలుకోలేను. నీవు ప్రామిస్ చేస్తే నిశ్చింతగా నిద్రపోతాను. ఉఁ. కాని ఆలస్యం చేయకు ప్లీజ్...."

జీవితంలో రెండు ట్రాజెడీలు. ఒకటి మనోవాంఛను పొందటం. రెండోది దాన్ని పొందలేక పోవడం! ఎలాంటి విషమ పరిస్థితిలో చిక్కుకుంది తను!

ఒక క్షణం ఆలోచించింది.

"ఊ. కాని త్వరగా." చేయిచాచిపెట్టుకొని అడుగుతున్నాడు.

మెల్లిగా అతని చేతిలో చేయి వేసింది.

"ఐ నో యు ఆర్ ఎన్ ఏంజిల్. నాకు తెలుసు నన్ను ...ంచుతావని. నీవు మాట తప్పవనికూడా తెలుసు. ఇక నాకు నిశ్చింతే. అంతా ఆనందమే" వందన చేతిని ముద్దుపెట్టుకుని, పట్టుకుని నిద్రలోకి జారిపోయాడు, ఇంజక్షన్ వల్ల. పసిపాప లోని ప్రశాంతతను అతని మొహంలో చూస్తూంది తనిపుడు.

...మాట తప్పవనికూడా తెలుసు' హుఁ. ముందరికాళ్ళకు ...పాడు.

...గే కూర్చుండిపోయింది వందన ఆలోచిస్తూ.

...న్ట్ లీవ్ మి డార్లింగ్ డోన్ట్ లీవ్ మి' అస్పష్టంగా ...ఫం

గొణుగుతున్నాడు నిద్రలో.

వందన చేయి విడిపించుకోవాలని చూపింది. కాని గట్టిగా వుంది పట్టు.

ఓ క్షణం నవ్వుతూ నిల్చున్నాడు రాజా కళ్ళముందు. అనురాగం కురిపిస్తున్న కళ్ళతో, ప్రేమ ఉప్పొంగుతున్న హృదయంతో, నిండు మనసుతో, ప్రపంచంలోని మమతంతా వంపుకున్న కంఠంతో ఆర్తిగా ప్రేమికుడు! రాజా!

ఆ దృశ్యం చెరిగిపోయింది.

పరితాపంతో ప్రక్షాళితమైన హృదయంతో తప్పు తెలుసుకొని క్షమార్పణ కోరుతూ పూర్వపు నరేంద్రగా ప్రేమని నింపుకున్న హృదయంతో దీనంగా చూస్తున్న తాళికట్టిన భర్త నరేన్!

ఒకవైపు రాజా! ఒకవైపు భర్త!

రాజాకు యిచ్చిన హృదయం.

భర్త కిచ్చిన మాట.

ఇద్దరూ అనురాగపు సిరులను తన యెదనిండా నింపడానికి సిద్ధపడుతున్నారు.

'డోన్టు లీవ్ మీ' 'డోన్టు లీవ్ మీ'

రాజా, నరేంద్ర ఒకేసారి వేయి కంఠాలతో ఆ మాటలు ఎలుగెత్తి పదే పదే అంటున్నట్లుగా ఆ మాటల హోరు గదినిండా ప్రతిధ్వనిస్తున్నట్లు, ఆ హోరు భరించలేని దానిలా గట్టిగా రెండుచెవులూ మూసుకుంది.

నో....నో....నో....

నేనేం చేయాలి?

ఎవరిని వదులుకోవాలి?

ఎవరిని చేరుకోవాలి?

మనసు రెండువైపులా సమంగానే మొగ్గుతుంది.

'ఓ గాడ్! నాకేది దారి! సేవ్ మీ!'

నరేంద్రను చేరుకుంటే రాజాకు అన్యాయం చేసినట్ల

రాజాతో వెళ్ళిపోతే భర్తకు అన్యాయం చేసినట్లవ

తల తిరిగిపోతోంది వందనకు.

ఇద్దరూ తనను వదులుకోడానికి సిద్ధంగాలేరు. తనూ అంతే!

కాని యిద్దరితోనూ వుండలేదు. ఏ ఒక్కరినీ నొప్పించలేదు.

ఓ గాడ్! షో మి ది రైట్ పాత్!

దీనంగా మనసులోనే ప్రార్థిస్తున్నట్లుగా కళ్ళు మూసుకుంది ఓ క్షణం.

ప్లైట్‌కు టైం అయిపోతూంది. వెంటనే బయలుదేరి వెళితే చేరుకోగలదు రాజాను.

కాని వెళ్ళలేదు తను.

వుండి గిల్టీగా వున్న మనసుతో నరేన్‌తో కాపురంచేయలేదు.

బ్రతికుండి రాజా కళ్ళల్లోని నిరాశను, మోసం చేసానన్న భావనను చూడలేదు. ఊహించనుకూడా లేదు.

పశ్చాత్తాప మనసుతో దహించుకుపోతున్న అతనికి "నేను వెళ్ళనని" చేతిలో చేయివేసి మాట యిచ్చింది. తను మాట యిచ్చిన తర్వాతే, తాను వెళ్ళనన్న గట్టి నమ్మకంతో నిశ్చింతగా ప్రశాంతంగా నిద్రపోతున్న నరేంద్రను వదిలి ఎలా వెళ్ళగలదు? ఒకవేళ వెళ్ళినా మాట తప్పానన్న బాధ యెదలో దహించుకుపోతూంటే సంతోషంగా యెలా వుండగలుగుతుంది?

ఏమిటీ అగ్ని పరీక్ష!

ఎటూ నిర్ణయించలేక పోతూంది.

కళ్ళు తెరచింది వందన మెల్లిగా.

నరేంద్ర మొహంలో ఆనందరేఖలు చూసింది.

మెల్లిగా చేయి విడిపించుకుంది.

నీళ్ళు త్రాగాలనిపించి లేచిన వందనకు ఎదురుగా నిద్ర సీసామీద పడింది దృష్టి.

ంతే. ఒక్క క్షణం తటపటాయించింది.

ని అదే సరియైన దోవ అనిపించింది.

సమస్యను ఇంతటితో అంతం చేయాలంటే ఇది తనతోనే యిపోవాలనుకుంది.

తన జీవితానికి ఫుల్‌స్టాప్ పెట్టడానికే నిశ్చయించింది.

నరేన్ తనను నిర్లక్ష్యం చేసినపుడు, నిద్రలేక అశాంతితో వేగిపోతున్న మనస్సుకు తాత్కాలిక ఉపశమనం కలుగజేసిన మాత్రలు, తనను రా రమ్మని పిలుస్తున్నట్లనిపించింది.

థాంక్‌గాడ్! సరియైన త్రోవ చూపావు.

ఇక ఈ మనోక్షోభకు, అంతర్యుద్ధానికి స్వస్తి!

* * *

"అబ్సర్డ్" చదివిన కాగితాలు టేబిల్‌మీద పెడ్తూ అన్నాడు మాధవ్.

డాబామీద కుర్చీలు వేసుకుని కూర్చుని ఎదురుగా కన్పిస్తున్న సముద్రంలోకి చూస్తున్న రావ్, మాధవ్ మాటలకు ఇటు తిరిగాడు.

"కథను అచ్చం కథలానే వ్రాసారు. పిటీ! ట్రాజెడీ చేసారు."

"కొందరి జీవితాలే ట్రాజెడీ" గంభీరంగావుంది రావ్ గొంతు.

"కాని మీ పాత్రల జీవితాలు మీ చేతుల్లోనే కదా వున్నాయి. మీరు సృష్టించిన పాత్రలే కదా అవి."

"కాదు, విధాత సృష్టించినవి."

ఆశ్చర్యంగా చూశాడు మాధవ్.

"నిజంగా సుష్మలాంటి స్త్రీలున్నారంటే నేను నమ్మలేక పోతున్నాను."

"వారి నెరిగిన వాడిని నేను."

"యు మీన్....ఇది వాస్తవంగా జరిగిన కథంటారా?" లేనట్లు చూశాడు మాధవ్.

మౌనంగా తల వూపాడు రావ్.

"జీవితాన్ని తరచి చూసి మహా రచయితలు చెప్పిన కేవలం తాత్కాలిక సుఖానికి మాత్రమే అన్వయించు వున్నారు. అదే కొందరిలో అజ్ఞానం. ఒక రచయిత "ఇగ్నోరెన్స్ యీజ్ ది నైట్ ఆఫ్ ది మైండ్, ఏ నైట్

మూన్ ఆర్ స్టార్."

"అంటే మీ వుద్దేశం....అజ్ఞానపు తెరలు మనసును మూసినపుడు, అహంకారపు పొరలు కళ్ళకు క్రమ్మినపుడు సుష్మాలాంటి వారు సానుభూతికి నోచుకోరనా."

"లేదు. నా వుద్దేశం అదికాదు. అలాంటి వారికి ఎదురుదెబ్బ తగిలినపుడు, దేన్నైతే చూసుకొని అహంకారంతో విర్రవీగుతారో దానికి గాయమయినపుడు, తమ సిద్ధాంతాలు తలక్రిందు లైనపుడు తప్పక సానుభూతి దొరుకుతుంది."

"ఏది ఏమైనా వందనకు పాఠకుల సానుభూతి దొరికేటట్లు చిత్రించారు."

"మీరు మళ్ళీ పొరబడుతున్నారు మాధవ్. నేను పాత్రల్ని నా యిష్టంగా చిత్రించలేదు. యథాతథంగా నాకు తెలిసిన వాళ్ళవ్యక్తిత్వాన్ని బట్టి వ్రాసాను."

ఒక క్షణం ఆగాడు రావ్.

"వందన అన్ని సుఖాలకు దూరం అయింది. అందుబాటులో వున్నది అందుకోలేక, వెతుక్కుంటూ వచ్చిన అదృష్టాన్ని పొందలేక పోతున్నాననే బాధతో, ఎవర్నీ నొప్పించకూడదనే భావనతో తన నిండు జీవితానికి తొందరపడి చరమగీతం పాడేసింది. అందరి సానుభూతికి అతీతంగా వెళ్ళిపోయింది."

"తొందరపడా?" ఆశ్చర్యంగా అన్న మాధవ్‌కు రావ్ కళ్ళ ...డా నీరు కన్పించింది.

"అవును. అనుకున్నది అనుకున్నట్లుగా జరిగితే జీవితానికి ...లేదేమో. అసలు శేఖర్ ఎయిర్‌పోర్ట్‌కు వెళ్ళనే లేదని వంద...యదు."

...అంటే...." అర్థోక్తిలోనే ఆపేసేడు మాధవ్, శేఖర్ ఎటో ...ం గమనించి.

...్ తనుచూపింది, విన్నది, చదివిన దానినిబట్టి మెదడులో ...ర్తుకు తెచ్చుకుంటున్నాడు. అప్పటి శేఖర్‌ను కళ్ళముందుకు ...న్నాడు.

...ం

ఆరోజు....

ప్లైట్‌కు టైం అయిందని, వందన ఆతృతగా యెదురు చూస్తూంటుందని భావిస్తూ 'సూట్‌కేస్' తీసుకు పోడానికి హడా విడిగా ఇంటిలో అడుగు పెట్టిన శేఖర్ షాక్ తిన్నట్టుగా ఆగి పోయాడు.

ఎదురుగా కన్పిస్తున్న దృశ్యం అతన్ని నిశ్చేష్టుడ్ని చేసింది.

గాజు ముక్కల మధ్య అచేతనంగా పడివుంది సుష్మా. గాజు ముక్కలు గుచ్చుకుని శరీరం అక్కడక్కడ గీరుకుపోయి రక్తం కారుతోంది. బుగ్గమీద రక్తం ధారగా కారుతోంది.

ఆదుర్దాగా దగ్గరకు వచ్చాడు శేఖర్.

కళ్ళ మీదున్న సుష్మా చేతిని మెల్లిగా తొలిగించాడు. అంతే. షాక్ తిన్నట్లయింది. రెప్పవేయడం మరిచాడు. రెండు కళ్ళల్లోను గాజు ముక్కలు గుచ్చుకొని రక్తం కారుతోంది.

"గాడ్!" అప్రయత్నంగా అంటూ ఆవేదనగా ఓక్షణం కళ్లు మూసుకున్నాడు ఆ దృశ్యం చూడలేనట్లు. వెంటనే కర్తవ్యం స్ఫురించినట్లు తేరుకున్నాడు.

గబగబా సుష్మాను రెండు చేతులమధ్యా ఎత్తి కార్లో పడుకో బెట్టాడు.

వెనక్కివచ్చి వందన తనకోసం యెదురుచూస్తూంటుంతని వందన యింటికి ఫోన్‌చేసాడు.

చాలాసేపు ఎవరూ తీయలేదు.

కొంపతీసి బయలుదేరలేదు కదా!

ఇంకోసారి డయల్‌చేసాడు ఆతృతగా!

ఫోన్ రింగవుతూంది.

కొద్దిగా కళ్ళు తెరిచాడు నరేన్. అయినా అలసట మూసుకుపోతున్నాయి.

నిర్ణయం తీసుకున్న వందన ఏమాత్రం కదలి అలా వుండిపోయింది.

ఫోన్ యింకా రింగవుతోంది అసహనంగా.

బలవంతంగా కళ్ళు తెరిచాడు నరేన్. ప్రక్కకు తిరిగి చేయి చాచి ప్రక్కనే వున్న ఫోన్ అందుకున్నాడు.

"హలో! శేఖర్ హియర్!"

.... ........

"హలో! వందన వుందా? ఎవరు మాట్లాడేది?" కాస్త ఆలస్యం కూడా భరించలేనట్లుగా వుంది శేఖర్ గొంతు.

"నేను .. నరేన్" నిద్రమత్తులో నీరసంగా పలికింది నరేన్ గొంతు.

"నరేన్ వందనకు చెప్పండి సుష్మా బలంగా గాయపడి పరిస్థితి చాలా సీరియస్‌గావుంది. వెంటనే హాస్పిటల్‌కు తీసుకెళ్తున్నాను. బహుశా కళ్లుపోతాయేమో. నేను ఎయిర్ పోర్ట్‌కు రావడం లేదని, నన్ను క్షమించమని వందకు చెప్పండి." గబగబా చెప్ప దలచుకున్నది చెప్పేశాడు. ఏదో అడగబోతున్న నరేన్‌కు అవతల ఫోన్ పెట్టేసినశబ్దం నిరాశ కల్గించింది.

"బహుశా కళ్లుపోతాయేమో" శేఖర్ మాటలు చెవుల్లో గింగురు మంటున్నాయి.

"ఓగాడ్! ఎంతపని చేశాను. నేను బలంగా తోయడం వలన యీ సంఘటన జరిగివుంటుంది."

కెవ్వుమన్న సుష్మా కేక చెవుల్లో ప్రతిధ్వనిస్తోంది యిపుడు.

అందమైన సుష్మా కళ్ళు పోగొట్టుకోవడం! ఓగాడ్! ఎంతటి ...దకరమైన సంఘటన.

నరేన్ మనసంతా అదోలా అయిపోయింది. వేదన క్రుంగ ... మత్తుగా నిద్రలోకి జారిపోయాడు. అలా ఎన్నిగంటలు ...యాడో తెలియదు.

...లకువ వచ్చిన నరేన్ కళ్లు వందనకోసం వెతికాయి. ... కన్పించిన వందనను చూడగానే సంతృప్తి నిండింది ... కాని ఇంతలోనే చురుగ్గా అయి, కనుబొమలు ముడి ...దన పడుకున్న తీరు అతనకి అనుమానం కలిగించింది.

ఆత్రంగా దగ్గరికి వెళ్ళి, క్రింద మోకాళ్లమీద కూర్చుని వందనను పిలిచాడు.

జవాబులేదు.

కుదిపి చూశాడు.

మనిషిలో చైతన్యం లేదు.

'వందనా' అయోమయంగా పిలిచి, నాడి చూశాడు.

అందడంలేదు.

అనుమానంగా చుట్టూ చూశాడు. అతని అనుమానం దృఢ పడింది. నిద్రమాత్రల సీసా వెక్కిరిస్తూ కనిపించింది. 'వందనా' ఒక్కసారిగా హృదయం చీల్చుకుంటూ వచ్చింది ఆక్రందన.

ఒకవైపు సుష్మా తనమూలంగా అంధురాలవుతోంది. ఇక్కడ వందన ప్రాణాలు కోల్పోయింది.

ఇద్దరి జీవితాలలోని విషాదానికి తను ప్రత్యక్షంగాను, పరోక్షంగాను కారకుడయ్యాడు.

ఇద్దరి జీవితాలను బలిగొన్నాడు.

షాక్ తిన్నట్లు అలానే కూర్చుండిపోయాడు.

* * *

సుష్మాను హాస్పిటల్‌లో చేర్చాడు శేఖర్. గాయాలను క్లీన్‌చేసి కట్టుకట్టారు. హాస్పిటల్‌లో కనీసం 20 రోజులైనా ఉండా లన్నారు. గాజు ముక్కలు బాగా బలంగా గ్రుచ్చుకోవడంతో లోతుగా దిగిపోయాయి కళ్ళల్లో. కళ్లు వచ్చే అవకాశం లేదని చెప్పేశా డాక్టర్లు.

అది విన్న శేఖర్ మనసు భారమైంది.

సుష్మా ఇది విని తట్టుకోగలదా? ప్రపంచంలోని న్నంతా, ఆనందాన్నంతా విచ్చలవిడిగా నిర్భయంగా అ లనే తపన గల సుష్మా యిపుడు సృష్టిలోని అందాలను చూడలేదు. స్వేచ్ఛగా, నిస్సంకోచంగా, నిర్లక్ష్యంగా సుష్మా ఇప్పుడొకరి ఆసరా లేకుండా ఒక్క అడుగైనా

కంటిమీద, శరీరంమీద అక్కడక్కడ కట్లతో, రక్తం ఎక్కువగా పోవడంతో నీరసంగా పాలిపోయివున్న సుష్మా చూసే వారిలో సానుభూతిని కలిగిస్తోంది.

*   *   *

రెండోరోజు సాయంకాలానికి స్పృహ వచ్చింది సుష్మాకు. ప్రక్కనే కుర్చీలో కూర్చునివున్నాడు శేఖర్.

"నాకు....నాకు ఏమయింది?" కంటిని, శరీరంమీద కట్టు కట్టిన భాగాన్ని తడుపుకుంటూ భయంగా, ఆదుర్దాగా అడిగింది.

శేఖర్ ధైర్యం చెబుతున్నట్లుగా సుష్మా చేతిని తన చేతిలోకి తీసుకొన్నాడు.

ఎప్పుడూ చలాకీగా, సరదాగా తిరిగే సుష్మా యిలా రక్తసిక్తగాయాలతో నిస్సహాయంగా, దైన్యంగా కనిపించడం శేఖర్ హృదయాన్ని ద్రవింపజేస్తూంది.

ఎలాంటి సుష్మా ఎలా అయిపోయింది? కలలో కూడా ఊహించివుండడు సుష్మా!

"శేఖర్! నువ్వేనా ఇక్కడ వుండేది. ఇపుడు నేనెక్కడ వున్నాను? నా కళ్ళకేమయింది? అబ్బా! కళ్ళు నొప్పిగా వుంది" ...ళ్ళ తడుముకుంటూ బాధగా అంది సుష్మా.

"నిన్న గాజుముక్కలు గ్రుచ్చుకుని గాయమయింది సుష్మా. ...స్పటల్‌లో వున్నావిపుడు. మరేం భయంలేదు. యు విల్ బి ...ట్" సానుభూతి పలుకుతూ ధైర్యం చెప్పాడు శేఖర్.

...జ్ఞాపకం తెచ్చుకుంది సుష్మా. "అవును నిన్న నరేంద్ర ... కోపంతో మాటా మాటా అనుకొన్నాం. రెచ్చిపోయి ...శాడు వెనక్కి. ఆ విసురుకు గాజు కిటికీమీద పడ్డాను. ...ళ్లో ఏదో గ్రుచ్చుకున్నట్లయింది. 'కెవ్వు'మని అరచి ... తర్వాత ఏం జరిగిందో నాకు తెలియదు....అన్నట్లు ...ఫ్లైట్‌కు వెళ్లాల్సినవాడివికదా! వెళ్ళలేదా?" ఆశ్చర్యంగా

"లేదు సుష్మా? సూట్‌కేస్ తీసుకోడానికి వచ్చిన నేను నిన్ను చూసేను. వెంటనే హాస్పిటల్‌కు తీసుకువచ్చాను."

"పాపం! నా మూలంగా ఆగిపోయావా? వెళ్ళిపోవల్సింది" పొరపాటున కూడా యిలాంటి మాటలు అనని సుష్మా యిలా మాట్లాడటం ఆశ్చర్యంగా వుంది శేఖర్‌కు.

"వందన వెళ్ళిపోయిందా?" సుష్మా మళ్లీ తనే అడిగింది.

"ఏమో! నాకు తెలియదు. నేను రావడంలేదని చెప్పమని నరేన్‌కు చెప్పాను."

నరేన్ పేరు వినగానే సుష్మాకు గుర్తుకు వచ్చింది.

"నిన్న నేను కోపంతో గ్లాసుతీసి నరేన్‌ను కొట్టాను. నుదిటికి తగలడం జ్ఞాపకం వుంది. బాగా బలంగానే తగిలి వుండాలి! అతని సంగతి ఏమైనా తెలిసిందా?" ఇదే మొదటిసారి వింటున్నాడు శేఖర్ సుష్మా ఇంకొకరిగురించి ఆదుర్దా పడటం.

శేఖర్‌కు ఇపుడు అనుమానం వస్తోంది. ఫోనులో నరేన్ గొంతు చాలా నీరసంగా విన్పించింది. ఎలా వున్నాడో? వందన వెళ్లిందో లేదో, శేఖర్‌కు తెలుసుకోవాలని ఆత్రంగా వుంది.

ఫోన్‌చేసి చూశాడు. ఎంతసేపటికీ ఎవ్వరూ పలకడంలేదు. శేఖర్‌కు అనుమానంవేసి నరేన్ ఫ్లాట్‌కు వెళ్ళాడు. గదిలోని దృశ్య శేఖర్‌ను కొన్ని క్షణాలపాటు నిశ్చేష్టుడిని చేసింది.

వందన సోఫామీద ప్రశాంతంగా నిద్రపోతున్నట్లుగా స్తోంది. క్రింద మోకాళ్ళమీద కూర్చున్న నరేంద్ర తల సోఫా వాలిపోయినట్లుగా వుంది. దగ్గరికెళ్ళాడు. అతని చూపు ద పడిన సూట్‌కేస్‌మీద, వందన చేతిలోంచి జారిపడిపో వున్న నిద్రమాత్రల సీసామీద పడింది.

అంటే వందన బయలదేరబోతూ, మనసు మా పని చేసివుండాలి అనుకున్నాడు. తను ఫోన్‌కాల్ సంగతి విని యిలా చేసిందా?

శేఖర్ మనసంతా భారంగా, బాధగా అయిపో

నరేన్ ఏమిటిలా వున్నాడు? వందనచేయి నరేన్ చేతిలో వుంది. నరేన్‌ను పిలిచాడు. భుజం తట్టాడు.

నరేన్ తలెత్తలేదు.

అనుమానంగా నాడి చూశేడు శేఖర్. కొట్టుకుంటోంది. నరేన్ తలను బలవంతంగా లేవనెత్తాడు. నుదుటను ప్లాస్టర్ వేసి వుంది. కళ్లు తెరచుకొనే వున్నాయి. అయితే భావరహితంగా వున్నాయి. చూపులు ఎక్కడో శూన్యంలోకి చూస్తున్నట్లుగావున్నాయి. భుజంపట్టి బలంగా కుదిపాడు. చైతన్యం కలుగలేదు. చాచిపెట్టి బలంగా లెంపకాయ కొట్టాడు శేఖర్. చెంపలు కందిపోయాయి గాని నరేంద్ర చూపుల్లో మార్పుగాని, బాధపడిన ఛాయలుగాని లేవు.

మొద్దుబారినట్లుగా వున్న నరేంద్రలో చైతన్యం కలిగించాలని వాస్తవానికి తీసుకురావాలని ప్రయత్నించని ప్రయత్నమంటూ లేదు. ఎన్నెన్నో ప్రయత్నాలు చేశాడు. కాని నరేంద్రలో మాత్రం ఏ మార్పూ రాలేదు. అతనికి మతిభ్రమణం కల్గిందన్న అనుమానం స్థిరపడింది.

తీసుకెళ్ళి సోఫామీద కూర్చోబెట్టాడు నరేంద్రను. మెదల ...ండా కూర్చున్నాడు నరేంద్ర.

నరేన్ ఎందుకిలా అయ్యాడో యెంత ఆలోచించినా అర్థం ...డం లేదు శేఖర్‌కు. తన ఫోన్‌కాల్ నరేంద్ర అందుకుని వంద ...చెప్పాక వందన ప్రాణాలు తీసుకుందో లేక ముందే ప్రాణాలు ...దో బోధపడలేదు. వందన ప్రాణాలు కోల్పోయిన దగ్గ ...నరేంద్ర అలా కూర్చుని ఉంది ఉండాలి. అంటే నిన్నటి ...ప్పటి దాకా అలాగే కూర్చుని వుండిపోయాడన్న మాట.

...వందన చావుతో నరేంద్రకు మతిభ్రమణం యెలా ...దనతో విడిపోవాలనుకున్న నరేంద్రకు యీ విషయం ...విస్తుంది? షాక్ ఇచ్చినా మతి చలించేంతగా, ఎలా అతని మీద పనిచేసిందో అర్థంకాలేదు.

తన అనుమానమంతా జవాబులేని ప్రశ్నలుగానే, అర్థంకాని 'పజిల్'లాగా వుండిపోయింది యీ విషయం శేఖర్ మనసుకు.

వందనవైపు తిరిగిన శేఖర్ కళ్లు చెమర్చాయి. వందనకు ఎంత ధైర్యం చెప్పాడు. జీవితం మీద ఆశ కల్పించాడు. ఆశల శిఖరాలమీద తీసికెళ్తానని నమ్మ బలికాడు. కాని....కాని....విధి ఇంకోలావుంది.

నిస్సహాయ స్థితిలోవున్న సుష్మాను వదలి రావడానికి మనసొప్పలేదు. మానవత్వమున్న మనిషిగా అలా చేయాల్సి వచ్చింది.

కాని....కాని....వందన యింత పిరికిదని అనుకోలేదు.

జీవితంలో ఓడిపోయాననుకుంది కాబోలు.

జీవితం పట్ల ప్రతి జీవికి ఉండే ఆశ, ఆకర్షణ గురించి ఎంతగా నూరిపోసాడో! అంతా గాలికి వదిలేసింది.

శేఖర్ మనసు మూగగా రోదించింది.

ఒక్క క్షణం తదేకంగా వందన మొహంకేసి చూసాడు. 'ఇక నాకే సమస్యలూ లేవు.' అన్ని అనుబంధాలను తెంపేసుకుని నిశ్చింతగా వెళ్ళి పోతున్నానన్నట్లుగా ఆ అందమైన మొహం ప్రశాంతంగా కన్పించింది.

అంతలో శేఖర్‌కు కర్తవ్యం స్ఫురించింది. నరేన్‌వై చూశాడు. ఎలా కుర్చొ బెట్టాడో అలాగే జీవంలేని శిలలా కూ న్నాడు. ఇహలోకంతో సంబంధం లేని యోగిలాగా, అన్ని అతీతంగావున్న సన్యాసిలాగా వున్న నరేంద్ర ఏం చేయగలడు

శేఖర్ నిశ్చయానికి వచ్చేశాడు. నరేంద్ర తల్లిద అడ్రెస్, వందన తల్లి దండ్రుల అడ్రస్ వెతికాడు. ముందు వందన తండ్రికి కేబుల్‌ద్వారా విషయం తెలియ ఫోన్‌లో మాట్లాడాడు. వస్తానని కేబుల్ యిచ్చిన క ఆత్రంగా ఎదురుచూస్తున్న వందన తండ్రికి యీ విష లేనంత బాధ అన్పించింది. కనీసం వందన శవం ప అని అడిగారు. వీలుందిగాని అది చాలా ప్రయాసతో

అని, ఇప్పటికే రెండు రోజులవుతోందని, అలా పంపడానికి ఏర్పాట్లు చేసే లోపల టైం పట్టవచ్చని, కాబట్టి యిక్కడే దహన సంస్కారాలు చేయించడం మంచిదని, మీకు నేను పరిచయస్తుడనే అని, వందనకు నరేంద్రకు కావల్సిన వాడినని తనను తాను పరిచయం చేసుకున్నాడు. నరేంద్రకు మతి చలించడం వల్ల తానే ఆపని చేయాలనుకుంటున్నట్లు, అందకు అనుమతి యివ్వవలసిందిగా కోరాడు. ఇదంతా విన్న వందన తండ్రికి మతిచలించినంత పనయ్యింది. ఆఖరికి అతి ప్రయత్నం మీద మనసును కూడగట్టుకొని 'ఈ సహాయంచేసి పెట్టమని' అర్థించారు శ్రీనివాసరావుగారు.

* * *

డాక్టర్లంతా తేల్చి చెప్పేశారు, నరేన్‌కు మెంటల్‌షాక్ వల్ల మతి భ్రమించిందని. నుదుటికి బలంగా గాయమయి రక్తం పోవడంతో అతి నీరసంగా వున్న నరేంద్ర మానసికంగా కూడా చాలా కృంగిపోయి వుండాలని, ఆ సమయంలో భార్యమరణం ఇతని మనసు మీద బలంగా దెబ్బతీయడంతో మతి చలించి వుండాలని చెప్పారు. తట్టుకోలేని విషయంతో మెంటల్ డిప్రషన్ ఏర్పడిందన్నారు.

కాని నరేన్‌లో ఎలాంటి ఉద్రేకం, ఆవేశం, ఆవేదన, పిచ్చి ...చ్చిగా చూడటం, వాగటం, అరవడం, కోపం లాంటి భావాలు ...వు. చూసే వాళ్ళకు మనిషి నిర్లిప్తంగా కన్పిస్తాడు. కాని చూపులు ...ప్పుడూ శూన్యంలోకి చూస్తూంటాయి. పెదవి విప్పి ఒక్కమాట ...ట్లాడడు. ఆకలేసినపుడు ఎదురుగా ఏమైనా ఉంటే తింటాడు. ...తే అదీలేదు. అలా శిలలా కూర్చుండి పోతాడు. అందుకనే ...ఎప్పుడూ అప్రమత్తతతో నరేన్‌ను చూసుకుంటూ, టైం ...ఆహారం, మందులు బల్లమీద ఉంచుతున్నాడు. ఎవరు ...ో కూడా నరేంద్రకు తెలియదు. నిద్రవస్తే కూర్చున్న ...పోతాడు. సజీవ శిలలా మారిపోయాడు.

* *

...ంత బాధగా.

...ి గాథగా.

కన్నీటి ధారగా.

కరగి పోయే.

తలచేది జరుగదు.

జరిగేది తెలియదు.

బొమ్మను చేసి ప్రాణంపోసి........

ఘంటసాల కంఠంలో ఆ పాట దయనీయంగా,హృదయాన్ని కదిలించేదిగా సాగుతోంది.

కుర్చీలో కూర్చున్న శేఖర్ అలసటగా, నిస్పృహగా వెనక్కి వాలిపోయాడు. ఎంత చక్కగా చెప్పాడు కవి భగవంతుని లీలలు.

శారీరకంగా, మానసికంగా చాలా అలసిపోయాడు శేఖర్. ఒకవైపు సుష్మాకోసం హాస్పిటల్ చుట్టూ తిరగాల్సివుంది. ధైర్యం చెప్పి, సానుభూతి కురిపించాల్సి వస్తోంది. వీక్‌గా వున్న సుష్మాకు తను అంధురాలన్న సంగతి తెలియనీయలేదు.

మరోవైపు వందన 'క్రిమేషన్' ఏర్పాట్లకోసం తిరిగి తిరిగి, అది పూర్తి చేశాడు. జీవితాంతంవరకు నిన్ను వదలనని చెప్పినతనే వందనను స్వహస్తాలతో పరలోకాలకు సాగనంపాల్సి వచ్చింది.

ఎంత విషాదకరం! ఎంత ఐరానికల్!

ఇంకోవైపు నరేంద్రను జాగరూకతతో చూసుకోవా వస్తోంది.

నరేంద్రను ఇండియాకు అతని తల్లిదండ్రులవద్దకు ప ఏర్పాట్లు చేసాడు.

అదృష్టవశాత్తు రెడ్డిదంపతులు సెలవుమీద ఇం వెళ్తున్నారు. వాళ్లు నరేంద్రను 'ఎస్కార్ట్' చేయడానికి సమ్మ అతను ఎలాంటి ఉద్రిక్తత చూపించకుండా, అన్ని అతీతంగా నిర్లిప్తంగా వుండటంవల్ల డాక్టర్స్ సర్టిఫికేట్ వల్ల పాస్‌పోర్ట్ దొరికింది. త్వరలోనే వాళ్లు వెళ్ళిపోత

నరేన్ వందనల బాంక్ బాలన్స్, ఫ్లాట్ లో విషయం, ఆస్తిపాస్తుల విషయం అంతా శేఖరే నరేంద్ర తండ్రి కోరికమీద.

ఇలా అన్నిటికోసం, అన్నిటా తనే తిరగాల్సివచ్చిన శేఖర్‌కు మొట్టమొదటిసారిగా జీవితం అంటే జేజారెత్తినట్లుగా వుంది.

నరేంద్ర విషయం, అతని ఆస్తిపాస్తుల విషయం ఇప్పటికి కొలిక్కి వచ్చింది.

ఇన్ని రోజులు ఒక్కక్షణంకూడా శారీరకంగా, మానసికంగా విశ్రాంతి తీసుకోవడానికి కూడా తీరిక లేకుండా తిరిగిన శేఖర్, యీరోజు కాస్త విశ్రాంతిగా కూర్చున్నాడు. అలవాటు ప్రకారం ఎప్పటిలా తనకిష్టమైనవి, ఘంటసాలగారు గానంచేసిన పాటలు వింటున్నాడు. పాటలు వరుసగా వస్తున్నాయి.

"కమ్మని భావమే కన్నీరై చిందెను
ప్రియమగు చెలిమి సాటిలేని కలిమి"........

ఇంతలో ఫోన్ గణగణమని మ్రోగింది.

పాటలు వింటూ పరధ్యానంలోవున్న శేఖర్ గమనించలేదు. ఫోన్ ఇంకోసారి మ్రోగడంతో ఉలిక్కిపడి అందుకున్నాడు శేఖర్.

హాస్పిటల్‌నుంచి సిస్టర్ చేసింది.

"మిస్టర్ శేఖర్! మీరోసారి అర్జంటుగా రాగలరా? మీ భార్య 'హిస్టీరియా' వచ్చినదానిలాగా ప్రవర్తిస్తోంది. పట్టుకోవడం ...కు కష్టంగా వుంది."

"ఇప్పుడే వస్తున్నాను" ఫోన్ పెట్టేసి, బయలుదేరాడు.

...వున్న గదివైపు గజగబా అడుగులు వేసాడు. సుష్మ కేకలు ...న్నాయి.

"లెట్ మీ గో....ఐ సే లెట్ మి గో....యూ....యూ ...ఆఫ్ మై హాండ్స్" తనకు రెండువైపుల ఇద్దరు సిస్టర్స్ ...గా పట్టుకోవడంతో పెనుగులాడుతోంది సుష్మ.

...జ్ శేఖర్? అతన్ని పిలవండి! నేనీ బాధ భరించలేను."

...డగానే సిస్టర్స్ అతనికి అప్పగించి తాము వెళ్ళి...

...గెత్తబోయిన సుష్మను గట్టిగా పట్టుకున్నాడు శేఖర్.

...! నువ్వు వచ్చేశావా? వీళ్ళు నన్నెక్కడికీ వెళ్ళనివ్వడం ... గొంతుతో అంటోంది. "నా కళ్ళు నొప్పి పెడు

తున్నాయి. కట్టువిప్పనివ్వడం లేదు వీళ్లు? నాకేమయింది! నిజం చెప్పడంలేదెవ్వరూ?" హఠాత్తుగా శేఖర్ గుండెలమీద వాలిపోయి వెక్కి వెక్కి ఏడుస్తోంది సుష్మా.

పుట్టి పెరిగి యిన్ని సంవత్సరాలకు సుష్మాకు బాధ అంటే ఏమిటో తెలిసినట్లుగా వుంది.

తను ఇన్ని రోజులుగా గడిపిన జీవితం తలచుకొంటూంటే తనమీద తనకే కోపం, అసహ్యం వేస్తోంది. అన్నిటికంటే శేఖర్ మంచితనం మరింత బాధిస్తోంది. తను అంత హేళన చేసినా, అనుక్షణం ప్రత్యక్ష నరకం చవిచూపినా, తనకోసం, కేవలం తన కోసం అతను ప్రయాణం మానుకోవడమే కాకుండా, కించిత్తు కూడా కోపం లేకుండా తనకు సేవచేస్తున్నాడు. తనకోసం శ్రమిస్తున్నాడు. సానుభూతి కురిపిస్తున్నాడు. ఇంత మంచితనం భరించడం కష్టంగా వుంది సుష్మాకు.

ఇవన్నీ తలచుకొన్నకొద్దీ సుష్మా దుఃఖం రెట్టింపు అయింది. ఇంకా అలానే ఏడుస్తున్న సుష్మా చుట్టూ చేతులువేసి ధైర్యం చెబుతున్నట్లుగా తల నిమురుతున్నాడు శేఖర్.

అలా శేఖర్ చేతుల్లో వాలిపోయిన సుష్మాకు తన బాధకు వుపశమనం కలిగినట్లుగా, తన బాధంతా ఎవరో చేత్తో తొలగిం నట్లుగా అన్పించింది.

సుష్మాకు ఇండియా వెళ్ళిపోవాలని, తండ్రిని చూ అన్పించింది.

"శేఖర్. మనం ఇండియా వెళ్లిపోదాం. కాదు కా మా డాడీ దగ్గరకు పంపించేయి," అంటూ అలసటగా క కుని అలాగే మెల్లగా నిద్రలోకి జారిపోయింది.

గండం గడచినట్లుగా తేలిగ్గా ఊపిరి వదిలి సు మీద పడుకోబెట్టాడు.

శేఖర్‌లో నీరసం ఆవహించినట్లయింది.

*　　　　*

నరేంద్ర తండ్రికి 'కేబుల్' యిచ్చి నరేంద్ర

లతోబాటు ప్లేన్ యెక్కించి వచ్చాడు శేఖర్. నరేంద్రపట్ల ఓ స్నేహితుడిగా, సాటిమానవుడుగా తన బాధ్యత తీరింది.

కాని కన్నవారిని, ఆత్మీయులను వదిలిపెట్టి విదేశానికి ఎన్నెన్నో కలలతో వచ్చిన తమ నల్గురి జీవితాలెందుకిలా అయ్యాయి? నల్గురి జీవితంలోనూ ఏదో రకంగా అపశ్రుతి పలికింది. వందన జీవితం అయితే తీగెతెగిన వీణలా అయింది.

శేఖర్‌కు నరేంద్ర డైరీ గుర్తుకు వచ్చింది. నరేంద్ర సూట్ కేస్ సర్దుతున్న శేఖర్‌కు అది కన్పించి, ప్రక్కకు తీసి పెట్టుకున్నాడు.

అర్థంకాని పజిల్‌లా మిగిలిన తన ప్రశ్నకు జవాబు దొరుకుతుందేమో అనే ఆశతో అది చదివి తిరిగి పెట్టేయాలనుకున్నాడు. కాని ఆ సంగతే పూర్తిగా మర్చిపోయాడు పని హడావుడిలో.

ఇప్పుడది చదవాలనిపించింది.

వందనతండ్రి వందనచావుకు కారణమేమిటని, ఆత్మహత్య చేసుకునే అవసరం ఏమొచ్చిందని లెటర్‌లో ప్రశ్నించి, శేఖర్‌కు తెలిసిన విషయాలు తెలుపమన్నాడు. నరేంద్ర తండ్రి కొడుకు మతిభ్రమణం సంగతి తమకి ఆశ్చర్యం, బాధ కల్గించి మతిపోగొట్టిందను ...ంటె వందన ఆత్మహత్య మారింత మతిపోగొడుతోందని, వందన ...వర్తనవల్ల నరేంద్రకు మతి చలించిందా? తెలుపమని వ్రాసాడు.

వందనను అనుమానించడం బాధ కల్గించింది శేఖర్‌కు. ...ప్రశ్నలకు, అనుమానాలకు జవాబు, నివృత్తి నరేంద్రడైరీలో ...గా అన్పించింది.

...ర్చుని చదివాడు శేఖర్.

...వల్ల అతనికి తెలిసిన విషయాలివి.

...ంద్రకు వందన అంటే ముందునుంచీ ప్రేమ, అనురాగం ...ధ్యలో సుష్మా ఆకర్షణలో పడిపోయాడు. వందన తన ...వడం అప్పుడప్పుడు కోపం కలిగించేది. అయినా ...మే. కాని క్రమంగా సుష్మాతో అనుబంధం పెరిగింది. అలవాటయింది.

ఒకసారి వందనకు చాలాకోపం వచ్చేసింది నరేంద్ర మాటలకు. ముభావంగా వుండిపోయింది. దాంతో నరేన్‌లో భర్త అనే ఆధిక్యతాభావం తలెత్తింది. అందరిలోనూ అవమానించడం మొదలెట్టాడు. అయినా సౌమ్యంగా వుంటూ, నరేంద్రను తిరిగి ఒక్కమాట అనేది కాదు.

వందనచేత మాట్లాడించాలని, మాట్లాడితే క్షమాపణ కోరుకోవాలని యెప్పటికప్పుడు పశ్చాత్తాపంతో అనుకునేవాడు. కావి వందన పట్టుదలగా వుండేది. మౌనం, ఓర్పు, సహనం వీటితో వందన చూపే తిరస్కారం, దేనికీ తలవంచని వందన వ్యక్తిత్వం నరేంద్రలో అతనికి తెలియకుండానే కసిని రేపింది.'

డైరీలో ఆఖరిసారిగా రాసిన పేజీకాబోలిది:

'వందన తన మౌనం అనే ఆయుధంతో బాధిస్తోంది. వందన ప్రవర్తన నాలో నాకు తెలీకుండానే కసిని రేపుతోంది. వందనతో మాట్లాడి ఎన్ని రోజులయింది? ఆ స్వరం వినకపోతే పిచ్చెత్తి నట్లుగా వుంటుంది. ఏం చేయాలి నేను: ఐ లవ్ యూ వందనా: ఐ లవ్ యూ.

పోనీ క్షమాపణ వేడుకోనా? నా పట్టుదల వదిలివేయనా? ఉహుం వందన ఒకమాటు ప్రేమగా మాట్లాడితే చాలు. నేను వందన కాళ్ళమీద పడటానికి కూడా సిద్ధంగా వున్నాను. ఈ మధ్య శేఖర్‌తో ఎక్కువ స్నేహంగావుంది. నాకెంత జలసీగా వుందో:

శేఖర్‌ని చంపేయాలని వుంది. శేఖర్‌తో వందనకు కేవలం స్నేహమని తెలిసీ నేను కావాలని అన్నిమాటలు పాపం వందన: ఇవన్నీ నేను నిజంగానే అంటున్నాన కాని శేఖర్ మీద జలసీతో తనమీద ప్రేమతో అంటున్నా వందనకు. డైవర్స్ ఇస్తానన్నాను. గాడ్: నేనెలా మాట? వందనను వదలి నేనుండగలనా: నో....వం అన్న మాటలు, నా ప్రవర్తన అంతా నటన అని, నేను నిజంగా అన్నవి కావని తెలిసేరోజు దగ్గరలోనే మాత్రం ఎన్నిరోజులు పట్టుదలగా వుండగలను?

మంచులా కరిగిపోతోంది. త్వరలోనే ఓ రోజు దానికి పూర్తిగా స్వస్తిచెప్పి, నిన్ను క్షమాపణ కోరుకుని ప్రసన్నురాలిని చేసుకుంటాను.

నువ్వు నాదానివి వందనా! ప్రేమ వున్నచోట 'జలసీ' ఉంటుందంటారు. నాపట్ల అది నిజం అయింది. నువ్వు శేఖర్‌తో స్నేహంగా చనువుగా వుండటం నేను సహించలేను. నీ చెక్కు-చెదరని స్వాభిమానం నాకోసం కాస్త సడలించవూ? నన్నర్థం చేసుకో....ఐ లవ్ యూ విత్ ఆల్ మై బాడీ అండ్ సోల్.'

అప్రయత్నంగా శేఖర్ చేతిలోంచి డైరీ జారి క్రిందపడింది.

అంటే వందనను నరేంద్ర అమితంగా ప్రేమించాడన్నమాట. అందుకే వందన చావు అతనిలో పెద్ద గాయాన్ని లేపింది.

నరేంద్ర మతిభ్రమణం, వందన చావుగురించి విన్నప్పుడు సుష్మ అన్న మాటలు గుర్తుకొచ్చాయి శేఖర్ కిపుడు.

"నరేంద్ర వందనను అమితంగా ప్రేమించాడనుకొంటాను. యెందుకనో వందనను ఒక్క-మాట అననిచ్చేవాడు కాడు. వందన ప్రసక్తి రాకుండా జాగ్రత్త పడేవాడు. నాకు గాయమయిన రోజు, అదే మేమిద్దరం ఆఖరిసారిగా కలుసుకున్న రోజు, అతడన్న మాటలు నాకు బాగా గుర్తున్నాయి. వందన పేరెత్తే అర్హతకూడా నాకు లేదన్నాడు."

శేఖర్‌ను తిరిగి ఆలోచనలు చుట్టుముట్టాయి.

సుష్మను తోసేసి, తన ఫ్లాట్‌కు వెళ్లిన నరేన్‌కు తనను వెళ్ళిపోతున్న వందన కన్పించి, డైరీలో వ్రాసుకున్నట్లుగా ...పంతో, బాధాతప్త హృదయంతో క్షమించమని, ప్రయాణం ...మని అర్థించి వుండాలి.

...దన మనసులో సంఘర్షణ చెలరేగి, ఎటూ తేల్చుకోలేక ...ాణత్యాగం చేసుకుని వుంటుంది. అసలే గాయపడి ...న్న నరేన్‌కు తను ఫోన్‌లో సుష్మను కళ్ళుపోతాయని ... తనమూలంగానే అయిందని మధన పడుతూండగానే ...శించిన విషయం గమనించి దెబ్బమీద దెబ్బ తగిలి

...ం

నట్లయి మనసు మొద్దుబారిపోయి వుంటుంది.

అన్నిటికంటె తను అంతగా ప్రేమించిన వందన మరణించిందని తెలియగానే పెద్ద షాక్ తగిలినట్లయి, అతన్ని యీ స్థితికి తెచ్చివుండాలి.

నరేన్ వందనలను తలచుకొంటే శేఖర్ మనసు అర్ద్రమవుతోంది.

వందన జీవితంనుంచి పారిపోయి అన్నిటికి అతీతంగా వెళ్ళిపోతే, నరేన్ బ్రతికుండీ అన్నిటికి అతీతంగావుండే మానసిక స్థితిలో వున్నాడు.

ఏమిటీ జీవితాలు?

విధి విలాసం ఎంతో అనూహ్యమైనదనినమ్మక తప్పడంలేదు.

భారంగా కళ్ళు మూసుకొన్నాడు.

* * *

ఒక్కోసారి అనిపిస్తుంది శేఖర్‌కు దీనికంతటికి సుష్మాయే మూలకారణం అని. సుష్మా నరేన్ జీవితంలో ప్రవేశింపకుండా వుండివుంటే....సుష్మామీద కోపం వచ్చేది.

కాని యింతలో నరేంద్రకు కూడా యిందులో భాగం వుందని, సుష్మాతో చనువుగా తిరిగి వందనను సాధించి, బాధించి, వందన ప్రేమను, క్షమాపణను పొందాలనే ప్రయత్నంలో మూర్ఖంగా వందనను పోగొట్టుకున్నాడనే విషయం గుర్తుకొచ్చింది.

చేసిన పాపాలకు పరిహారం, శిక్ష వుంటుందని నమ్మి నరేన్ సుష్మాలు తెలిసో తెలియకో చేసిన పొరపాట్లకు ఫ ఈ లోకంలోనే యీ జీవిత కాలంలోనే అనుభవిస్తున్నారని శేఖర్‌కు.

అంతలోనే వారు జీవితంలో ఎంతో విలువైనవా అజ్ఞానంతో మూర్ఖత్వంతో పోగొట్టుకొన్నారని సానుభ కలుగుతుంది.

కనీసం సుష్మాకైనా జీవితం అంటే రోత, వి కుండా చూడాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు. తను

విషయం ఆమెనుంచి దాచాడు.

సుష్మా ఇండియా వెళ్ళిపోదాం అని రోజూ గొడవ పెడుతూంది.

నరేన్ వందనల జ్ఞాపకాలను బలవంతంగా మనసులోంచి తొలగించాలని ప్రయత్నిస్తున్నాడు శేఖర్.

తమ నల్గురి బ్రతుకుల్లో యింత విషాదాన్ని నింపి, తమ జీవితాలనే తారుమారుచేసి, అస్తవ్యస్తంగా వదిలిన యీ పరిసరాల నుంచి దూరంగా, సుదూరంగా, యీ ప్రపంచంలోని యెవరికీ అందనంత దూరంగా పోవాలనిపిస్తోంది శేఖర్‌కు. అంత బేజారెత్తి పోయింది మనసు. సుష్మా కోరినట్లు తొందరలో ఇండియా వెళ్ళి పోవాలనుకున్నాడు.

* * *

సుష్మాను హాస్పిటల్‌నుంచి ఫ్లాట్‌కు తీసుకొచ్చేసాడు శేఖర్. పాస్‌పోర్ట్ సాధ్యమైనంత తొందరలో తెప్పించుకోవాలని తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడు శేఖర్.

మిసెస్ నందా సుష్మా అవసరాలు గమనించడంలో శేఖర్‌కు చాలా సహాయం చేస్తూంది.

ఒకరోజు శేఖర్ బయటకు వెళ్లి వచ్చేసరికి సుష్మా ప్రక్క-లదిరిపోయేలా హృదయవిదారకంగా ఏడుస్తోంది. గాబరాగా దగ్గరి ళ్లాడు. "సుష్మా? ఏమైంది?" ఒకసారి తలెత్తి తిరిగి దిండులో హం దాచుకుంది. వెక్కిళ్లమధ్య అంటోంది "నాకు చచ్చిపోవా ందుంది. కళ్ళులేని నేను బ్రతికి ఏం చేయాలి? ఇంకొకరికి భార తప్ప? నన్నెందుకు బ్రతికించావ్? నాకు కాస్త విషం తెచ్చి ర్."

ఎవరు చెప్పారు నీకీ సంగతి?" కఠినంగా మారింది శేఖర్

ర్మ దంపతులు వచ్చి వెళ్లారు" ఏడుస్తూనే అంది.

ఏం మనుషులు? సానుభూతి చూపడానికి వచ్చి మరింత పోతారు."

ం

గొంతు సౌమ్యంగా మార్చి అన్నాడు శేఖర్.

"సుష్మా! ఆ మాటలు నమ్మి నువ్వు బాధపడకు...."

అంత ఏడ్పులోనూ విషాదంగా నవ్వింది.

"ఇంకా నన్నెందుకు మభ్యపెట్టాలని చూస్తావు." తను వేసే ప్రతి అడుగు ఇంకోరి ఆసరాతో వేయాలనే భావన క్రుంగదీస్తోంది.

ఛీ. ఏం బ్రతుకిది?

తాను ఛీత్కారం చేసి, నీ అవసరం నాకేమిటి అన్న వ్యక్తి చేతే అన్నీ చేయించుకోవాల్సి వస్తోంది. సిగ్గుతో చచ్చిపోయినంత పనవుతోంది.

ఎలాంటి సంకోచమూ, కోపము లేకుండా శేఖర్ అన్నీ చేస్తున్నా, చేయించుకోడానికి అభిమానం అడ్డువస్తోంది.

"శేఖర్ నన్నెందుకు అసహ్యించుకోవు?" మనసులోనే కుమిలిపోతోంది సుష్మా.

ఇంత విషం తెచ్చిపెట్టమని మళ్లీ మళ్లీ అడిగి ఏడుస్తూంది.

కొంచెం సేపటికి ఏడుపు ఉధృతం తగ్గింది.

ఇన్ని రోజులుగా వందనకోసం, నరేంద్రకోసం, సుష్మా కోసం శ్రమించి జేజారెత్తిన మనసుతో వున్న శేఖర్‌కు సుష్మా ధోరణి చిర్రెత్తించింది.

చేతులు చప్పుడయేలా జోడించాడు. "సుష్మా! ఫర్ గాడ్స్ సేక్ నన్ను విసిగించకు. ఇప్పటికే చాలా వేసారిపోయాను" మొదటి సారిగా సుష్మామీద విసుక్కున్నాడు శేఖర్. తన ఓర్పును పరీ స్తోంది అనుకున్నాడు.

ఆ మాటలతో నిశ్చబ్దంగా ఏడుస్తూ ఉండిపోయింది.

ఇండియా వెళ్ళగానే ముందు శేఖర్‌కు విడాకులివ్వాలి జీవితానికి తనొక గుదిబండ కాకూడదు. శేఖర్ భవిష్య ప్రతిబంధకం కాకూడదు. ఒకసారి విడాకుల మాట యె మాట్లాడుకొందాం అని మాట తప్పించేడు.

విడాకులిచ్చేస్తే తనని అభిమానంగా, ఆప్యాయం వారెవరున్నారు?

డాడీ యెన్నో రోజులుండరు. ఆయన వున్నంత కాలం ఆయన చూసుకుంటారు. ఆ తర్వాత?

వదినకి, అన్నయ్యకు, అసలెవరికీ భారం కాకూడదు. దానికి ఒకటే దారి.

చచ్చిపోవాలి....చచ్చిపోవాలి....ఇదే ఆలోచన. కాని ఎలా?

శేఖర్‌ను నిద్రరావడంలేదని, నిద్రమాత్ర లిమ్మని అడిగింది. శేఖర్ తెలివిగా ఒకటే యిస్తున్నాడు రోజూ. ఇంకోటి అడిగినా యివ్వడంలేదు. హాస్పిటల్‌లో వున్నప్పుడుకూడా సిస్టర్స్‌ను అడిగేది. ఇచ్చినవి తీసిపెట్టేది.

ఒకరోజు గుప్పిటనిండా యేదో నోట్లో వేసుకోబోతున్న సుష్మాను అప్పుడే కిచెన్‌లోంచి టీ పట్టుకొస్తున్న శేఖర్ చూసి, చటుక్కున దగ్గరికొచ్చి గుప్పిట బిగించివున్న చేయి బలంగా పట్టి ఆపాడు. 'టీ' బల్లమీద పెట్టి గుప్పిట తెరవబోతూంటే పెనుగులాడుతూంది. "వదులు: నన్నొదలమంటుంటే" కోపంగా అంటోంది.

బలవంతంగా గుప్పిట తెరచిచూసిన శేఖర్ ఆశ్చర్యపోయాడు నిద్రమాత్రలు చూసి.

తను తెలివిగా ఒక్కొక్కమాత్ర చొప్పున యిస్తూంటే తనకంటె తెలివిగా అవి దాచిపెట్టి అన్నీ ఒకేరోజు మింగాలనుకున్నదన్నమాట. తనిచ్చిన దానికన్నా యెక్కువగా వున్నాయి.

"ఎక్కడివివన్నీ?" కోపంగా అడిగాడు.

వెక్కిళ్ళమధ్య బెదురుతూ చెప్పింది సుష్మా.

"ఆఖరిసారిగా చెప్తున్నాను. ఇంకోసారి యిలా చేసేవంటే ... నాకు అనవసరంగా కోపం తెప్పించకు. వన్నీ మాత్రం ...కూడా బ్రతకనివ్వవా? నేనేం పాపంచేశానని యింకా యిలా ...? ఇలా చచ్చిపోయి మీ నాన్నముందు నన్ను దోషిగా నిల... ...సురుగా సోఫామీదకు తోసాడు.

"...బాధ నీకెలా చెప్పను?....కాదు .... అదికాదు...."

...ను ఆక్రోశిస్తోంది.

"నిన్ను మీ నాన్నకు అప్పజెప్పాల్సిన బాధ్యత నాకుంది. మనం ఇంకోవారం పదిరోజులలో ఇండియా వెళ్ళిపోవచ్చు. నిన్ను మీ నాన్నదగ్గర చేర్చేవరకు నాకున్న యీ కనీసపు మనశ్శాంతిని కూడా దూరంచేసి పుణ్యంకట్టుకోకు. నిన్ను చేతులు జోడించి మరీ అడుగుతున్నాను."

'నీకు మనశ్శాంతిని దక్కించాలనే నా యీ తాపత్రయమంతా అని నిన్నెలా నమ్మించను. నేను బ్రతికుండగా నీ కది దక్కదు.' సుష్మా మనసు మూల్గుతోంది. చచ్చిపోవాలనే కోరిక బలపడుతోంది.

* * *

అటుతిరిగి ఫోన్‌లో మాట్లాడుతున్నాడు శేఖర్. వీలైతే రేపటి ఫ్లైట్‌కు 'టికెట్స్' ప్రయత్నించమని యెవరినో బ్రతిమాలుకుంటున్నాడు. పరిస్థితినంతా విపులంగా వివరిస్తున్నాడు. అవతల మాట్లాడుతున్నది సంఘంలో బాగా పరపతివున్న వ్యక్తి. అందుకనే అతనిద్వారా వీలైనంత త్వరగా టికెట్స్ తెప్పించాలని శేఖర్ ప్రయత్నం.

ఫోనుపెట్టేసి సాలోచనగా ఓ క్షణం నిలబడి, యిటు తిరిగిన శేఖర్‌కు సుష్మా కన్పించలేదు. ఫ్లాట్ అంతా వెదికాడు. ఎక్కడా లేదు.

అనుమానంవచ్చి శేఖర్ ఫ్లాట్ బయటికివచ్చి, రోడ్డువైపు చూసాడు. ఎప్పుడు వచ్చిందో గాని సుష్మా రోడ్డుమీద నిలబడి వుంది ఏదో వాహనం స్పీడుగా వస్తున్న శబ్దంవిని, అటువైపుగా పరిగెత్త సాగింది. ఇంకో అరక్షణంలో వాహనం క్రిందపడే కాని మెరుపులా శేఖర్ సుష్మాను పట్టుకొని బలంగా వెన లాగాడు. వెంట్రుక వాసిలో ప్రమాదం తప్పింది. వాహనం ధ వెళ్ళిపోయింది.

సుష్మా బలమంతా ఉపయోగించి శేఖర్ చే విడిపించుకోవాలని పెనుగులాడుతోంది.

"సుష్మా" శేఖర్ పిలుపు విన్పించుకోకుండా త అటు ఇటు త్రిప్పుతోంది.

'వదులు నన్నొదలని' కావాలని మెలికలు తిరుగుతోంది.

పట్టుకోవడం కష్టంగావున్న శేఖర్ కోపంగా చేయ్యెత్తి చాచి ·ఠుగా సుష్మా చెంపమీద కొట్టాడు.

కూడ గట్టుకుంటున్న సహనం యెగిరిపోయింది శేఖర్‌లోంచి.

అంతే! చెంప పట్టుకుని నిల్చున్న సుష్మా పెనుగులాటను చేసింది. కన్నీరు కారుతోంది బుగ్గల్లోంచి.

*                    *                    *

రావు భారంగా కళ్ళు మూసుకున్నాడు.

మాధవ్ మనసంతా అదోలా అయిపోయింది.

రావు చెప్తున్న కథలో తనూ ఒక భాగమైనట్లుగా అనుభూతి ·దాడు.

"అయితే....శేఖర్ ఏమయ్యాడు?"

మాధవ్ ప్రశ్నకు కళ్ళు తెరిచిచూశాడు రావ్.

"శేఖర్" ఆక్రందనలా యెవరిదో స్త్రీ గొంతు విన్పించింది.

వెనక్కి తిరిగి చూసారిద్దరూ.

ఎవరో అందమైన యువతి నిల్చుంది.

చటుక్కున లేచి దగ్గరికెళ్లాడు శేఖర్, అదే రావ్. శేఖర్ ·డెల్లో వదిగిపోతూ కన్నీళ్లమధ్య అంటోంది ఆమె. "ఓ గాడ్! భయంకరమైన పీడకల!

నువ్వూ నేను ఓ బ్రిడ్జిమీద వెళ్తున్నామట. మనతో ఓ చిన్నారి కూడా వున్నాడట. నన్ను నువ్వు జాగ్రత్తగానే చూస్తూ నడి ·న్నపట. హఠాత్తుగా ఓచోట ఆగి నన్ను నీవు బ్రిడ్జిమీంచి చాలా ·గా వున్న నీళ్లల్లోకి తోసేసావట." హఠాత్తుగా అతనికి చేరువయింది.

"ఓ డార్లింగ్! నువ్వలా వదిలేస్తావా? చచ్చిపోవాలనుకున్న బలవంతంగా బ్రతికించి, ఆశలు కల్పించి, యిపుడు ·ఠగా మధ్యలో. వదిలేస్తావా?" వెక్కిళ్లమధ్య అంటోంది.

ఆర్తిగా శేఖర్‌ను హత్తుకుపోయింది.

"నాకోసం కాదుగా శేఖర్ నా బాధ! మనకు కలగబో
చిన్నారిబాబుకోసం—ఓ డార్లింగ్! నెవర్ లీవ్ మీ. నేనింతక
మూర్ఖంగా పోగొట్టుకున్నదేమిటో తెలిసివచ్చింది. నీ విలువ తెలిసి
నీ సాన్నిధ్యంతో జీవితమంతా సుఖంగా, సంతోషంగా గడచిపో
దని, నీ చేతుల్లోనే నా బ్రతుకు చాలించాలని కోరుకుంటున్న
తరుణంలో నన్ను దిక్కులేనిదానిలా చేసి విడిచి వెళ్ళకు శేఖ
శేఖర్ చేతులు ఆ యువతి చుట్టూ బిగుసుకున్నాయి.

"పిచ్చిదానా! కేవలం కల ఆధారంగా ఏమేమో పి
ఊహించుకుని బాధపడకు."

"ఏమో తలచుకొంటూంటే ఒళ్లు జలదరిస్తోంది. శేఖర్! 
నెవర్ లీవ్ మీ! ప్రామిస్ యు నెవర్ లీవ్ మీ శేఖర్! ప్రామిస్
వెక్కిళ్ళ మధ్య అస్పష్టంగా అంటోంది.

రావ్ గొంతు ఆప్యాయతగా పలుకుతోంది.

"అయ్ ప్రామిస్! అయ్ రియల్లీ ప్రామిస్ సుష్మా"

సుష్మా

మాధవ్ ఆశ్చర్యంగా ఆ యువతి కళ్ళవైపు చూశాడు.

'సుష్మా ఏమయింది' అని తానడగని ప్రశ్నకు
దొరికింది.



వచ్చే సంచికలో

**నవలల పోటీలో**
**బహుమతి పొందిన నవల**



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M109 |
| పుస్తకం పేరు | జ్యోతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Ruksha |
| స్కాన్ చేసినది | ch Ramya |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |